# మేలిరకం "డస్ట్" టీలలో సాటిలేనిది

## లిప్టన్స్ హిమాలయన్ గోల్డెన్ డస్ట్ టీ



ఈ టీతో మీరు కమ్మని, చిక్కని బంగారు ఛాయగల టీ కప్పుల వెంబడి కప్పులు అతి త్వరలో తయారుచేయకలుగుదురు. ఈ పానీయమును మీరే త్రాగి చూడండి అతిథులకుకూడా యివ్వండి. మీరు తప్పక సంతోషంతో వికసిస్తారు. అవును-మీ ఆనందభరితులైన అతిథులుకూడాను. లిప్టన్స్ హిమాలయన్ గోల్డెన్ డస్ట్ టీ మేలిరకం టీలలో నిజంగా అద్వితీయమైనది.




లిప్టన్స్ అంటే మంచి టీ






LHGC-7 TEL



జనరంజని ఫిలింస్ వారి

సంగీతం: చలపతిరావు
మాటలు: రావికొండలరావు
పాటలు: దాశరథి, నారాయణరెడ్డి
ఛాయ: ఎం.కె.రాజు
కళ: గోఖలే. కూర్పు: కృష్ణస్వామి
నృత్యాలు: చిన్ని-సంపత్
మేకప్ చీఫ్: కుమార్
సహదర్శకుడు: కె.వి.రావు
స్టిల్స్: భూషణ్
పబ్లిసిటీ డిజైన్స్: స్టూడియో కేతా
ప్రెస్ పబ్లిసిటీ: కల్పన ఎంటర్ ప్రైజస్
ప్రొడక్షన్ కంట్రోలర్ కోటేశ్వరరావు
స్టూడియో: వాహిని



దర్శకత్వం
తాతినేని రామారావు
నిర్మాణం:
డా. కె.వి.సుబ్బయ్య-చలపతిరావు

విడుదల: ఆంధ్ర: రాయల
రాయలసీమ: జయలక్ష్మి తెలంగాణా: డిషా




స్వాతంత్ర్యదినోత్సవ శుభ సమయంలో 5 సరికొత్త పుస్తకాలు

# ఎమెస్కో పాకెట్ బుక్స్ ఆగస్టు విడుదలలు

| | | | | |
|---|---|---|---|---|
| దుఃఖితులు | చైత్రపూర్ణిమ | సిపాయి కూతురు | బ్రతుకుజోడు | కొత్తనీరు |
| రంధి సోమరాజు | కాశ్మీర చరిత్ర కథలు | కొవ్వలి లక్ష్మీనరసింహారావు | ఎ.లక్ష్మీరమణి | ఇం కామేశ్వరి |
| గొప్ప చిత్రకారుని కథ | పి.గణపతిశాస్త్రి | చారిత్రక నవల | ఆదర్శస్త్రీమూర్తి కథ | చక్కటి కుటుంబగాథ |
| వెల రు.2/- | వెల రు 2/- | వెల రు 2/- | వెల రు.2/- | వెల రు 2/- |

మీ దగ్గరలో వున్న బుక్ షాపులోగాని దినపత్రికల న్యూస్ ఏజెంటుని గాని అడగండి. వెంటనే తెప్పించి పెట్టమనండి. అదీ కాదంటే మాకు వ్రాయండి. పాఠకులు పైఅయిదు పుస్తకాలూ ఒకేసారి తెప్పించు కుంటే పోస్టేజి ఉచితం. సొమ్ము పూర్తిగా ముందే మనియార్డరు కట్టాలి. విడివిడిగా కావాలంటే ఒకో ప్రతికి 25 పై పోస్టేజి అదనం. ఇదే పుస్తకం ఖరీదు ముందుగా మనియార్డరు పంపాలి. రిజిస్టరు పోస్టు కావాలంటే 10 పై అదనం

* * * * * * * * * * * * * * * * * * *

పుస్తక విక్రేతలకు ఆకర్షణీయమైన టరమ్సు! వివరాలకు వెంటనే వ్రాయండి

* * * * * * * * * * * * * * * * * * * *

## ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

రాష్ట్రపతి రోడ్

సికింద్రాబాద్

*** * * * * * ఇంతవరకు వెలువడిన ఎమెస్కో పాకెట్ బుక్స్**

1. దిండుక్రింద పోకచెక్క -విశ్వనాథ సత్యనారాయణ
2. బ్రతికిన కాలేజి -పాలగుమ్మి పద్మరాజు
3. పాకీ - ముళ్ళపూడి వెంకటరమణ [పాకీ సినిమా స్క్రిప్టునాటకం]
4. గ్రహణం విడిచింది ద్వివేదుల విశాలాక్షి
5. విచిత్రవలయం - చలం (కథలు)
6. విడిపోదు ఆకాశం -గొల్లపూడి మారుతీరావు
7. హౌస్ సర్జన్ కొమ్మూరి వేణుగోపాలరావు
8. నిరీక్షణ - ఉన్నవ విజయలక్ష్మి
9. కాశ్మీరపట్టమహిషి పి. గణపతిశాస్త్రి
10. ఆత్మబలి - పి. ఆనందారామం
11. సుఖంకోసం - వీరాజీ
12. బంధమూ, అనుబంధమూ -పి. వి. కృష్ణమూర్తి
13. స్వీట్ హోం -ముప్పాళ రంగనాయకమ్మ
14. మూరు శరత్తులు - మంజుశ్రీ
15. కోనేమా, సెలయేరూ - వాసమూర్తి
16. ఇదే దారి - బలివాడ కాంతారావు
17. బుద్ధుని జాతకకథలు శ్రీ శివశంకరస్వామి
18. అహం - అనర్థం - ముద్దంశెట్టి
19. స్వయంవరణం -మహీధర రామమోహనరావు
20. అదృష్టచక్రం - హరికిషన్
21. వక్రగతులు, ఇతరకథలు మధురాంతకం రాజారాం
22. గిరీశం ది గ్రేట్ సెకండ్ స్టెప్ వర్ధమన్నాటి కుటుంబరావు
23. సామాన్యుడి కామన - హితశ్రీ
24. ప్రాణాంతక ప్రణయం వి. యస్. అవధాని
25. శ్రుతితప్పిన రాగం -పి. వి. రాజమన్నార్
26. చిట్లీచిట్లని గాజులు విశ్వనాథ సత్యనారాయణ
27. దైవమిచ్చిన భార్య - చలం
28. రత్నకంబళం - రేవనూరి శమంత
29. వారధి - ద్వివేదుల విశాలాక్షి
30. అపరాజిత వాకాటి పాండురంగరావు
31. పూలతెరలు - కోమలాదేవి
32. అది ప్రశ్న - ఇదిజవాబు -అవసరాల రామకృష్ణరావు
33. ఇద్దరం ఒకటే - వీరాజీ
34. కల్యాణమడియ - అద్దేపల్లి వివేకానందాదేవి
35. ప్రేయసి : ప్రియంవద -శిషశ్రీ (జంటనవలికలు)
36. దరిజేరిన ప్రాణులు -ఇల్లిందల సరస్వతీదేవి
37. హారతి - కొమ్మూరి వేణుగోపాలరావు
38. వెన్నెల కాటేసింది -గొల్లపూడి మారుతీరావు
39. వరలీస్వరాలు - నందుల సుశీలాదేవి
40. మంచుపల్లకి మరి తొమ్మిది - శ్రీపతి

## నూతన నటీనటులు కావాలి!

శ్రీ సప్తగిరి ఆర్ట్స్ సమర్పించు

ప్రొడక్షన్ నెం:1



# వజ్రాలు వనితలు

## ఏజంట్ నెం. 069

గుమ్మడి. కృష్ణ. వాణిశ్రీ



దర్శకత్వం: గిడుతూరి సూర్యం

నిర్మాత : చెంచురామిరెడ్డి

సంగీతం : కోదండపాణి

రచన : ప్రసన్న. దాసం గోపాలకృష్ణ

కెమెరా : కణ్ణప్ప

సరికొత్త నటీనటులను ప్రోత్సహించడమే మా ధ్యేయం. అవకాశాలకై నిరీక్షించే నూతన నటీనటులు దీన్ని సద్వినియోగపరుచుకొని ఉత్తరాల ద్వారా సంప్రదించండి.

వివరాలకు:
శ్రీ సప్తగిరి ఆర్ట్స్
నెం.3. నెహ్రూ స్ట్రీట్. టి.నగర్. మద్రాసు.17

## ప్రొడక్షన్ నెం:2

# కుక్కలున్నాయి జాగ్రత్త

B.R.P.

పాఠకులందరికీ స్వాతంత్ర్య దినోత్సవ శుభాభివందనలు.

స్థలాభావంచేత ఈ వారం క్షేమేంద్రుని బృహత్ కథామంజరి కథలు, పవిత్రాలోకం, ధర్మపథం, పరిచయం శీర్షికలను ప్రచురించలేకపోతున్నాము.

—సం॥

## ముఖచిత్రం

ముద్దొలొలికే 'ముద్దుపాప' చిత్రంలోని ముద్దుల రాణి ముఖచిత్రంలో ఈ వారం పత్రిక చూడ ముచ్చటగా వున్నది. మీరు ప్రచురిస్తున్న రెండు సీరియల్స్ పత్రికకు హైలైట్స్. పెళ్ల కూరు జయప్రదగారు రచించిన 'పరమ పద సోపానము' కథ చాలా బాగుంది. ఇంత మంచి కథను అందించి మా హృదయాలందు చెరగని ముద్రను వేసుకున్న రచయిత్రి ఎంతైనా అభినందనీయులు.

మేకా సావిత్రీదేవి, (సికింద్రాబాదు.)

## సీరియల్

మీరు ప్రచురించుచున్న రాగమయి సీరియల్ నవల చాలా బాగున్నది. ముఖ్యముగా భానుమతి పాత్రను రచయిత్రిగారు పరిపూర్ణ వ్యక్తిత్వము గల స్త్రీగా ఆ పాత్రను చాలా చక్కగా సృష్టించి నది. ఈ వారం (26—7—68) పత్రిక చాలా బాగున్నది. భానుమతి మెత్త మెత్తగా ఎలిసీని గర్వభంగం చేసినందులకు చాలా సంతోషంగా వుంది. రాగమయి, నవలకు భానుమతి పాత్ర సంభాషణం వంటిది. రచయిత్రిగారికి నా శుభాకాంక్షలు తెలుప గోరుతాము.

ఈ వారం పత్రికలో వేసిన ఆడమనసులు, మనసువిప్పి, చాలా బాగున్నది. కాని ముగింపు బాగా లేదు. అరుణ వచ్చి రాధను క్షమించమని అడిగి వుంటే బాగుండేది. ఆ లేత హృదయం ఎంత బాధ పడివుండేదో? తిరిగి వాళ్ళు వెళ్ళిపోయినట్లుగా వుంటే బాగుండేది.

లింగారెడ్డి సుబ్బారెడ్డి, (అద్దంకి).

* * *

'రాగమయి' సీరియల్ చాలా బాగుం టోంది. అందులో ముఖ్యంగా భానుమతి ప్రవర్తనలో, సంభాషణల్లో సంస్కారం వుట్టిపడుతోంది. కేవలం డిగ్రీ చదువుల వల్ల సంస్కారం రాదనే సత్యాన్ని రచ యిత్రి భానుమతి పాత్రద్వారా చెప్పడం బాగు. ఒకవారం విపరీతం చదువుతుంటే నవ్వు, విశ్రాంతుల మవుతున్నాము.

కుమారి యస్. సుగుణ, (శీతారాంపురం మైన్స్)

# ఉత్తరాలు

## కథలు

జయప్రదగారు వ్రాసిన పరమపద సోపానము చాల చక్కగా వుంది. ఎన్నో మెలికలు తిరిగి చివరగా నన్ను కదిలించి వేసింది. సాధనిని చక్కగా చిత్రీక రించారు. చక్కని కథ వ్రాసినందుకు రచయిత్రిని ప్రచురించినందుకు మిమ్మల్ని హృదయపూర్వ కంగా అభినందిస్తున్నాను.

శ్రీరామమూర్తి, (బాపట్ల)

* * *

6—7—68 ఆంధ్రపత్రిక సచిత్ర వార పత్రికలో పెళ్లకూరు జయప్రదగారు రాసిన కథానిక "పరమపద సోపానము" చాలా బాగుంది. తెలుగు రచనల్లో, భావనా శిల్పానికీ, యిది గొప్ప నిదర్శనం. రచయిత్రికీ, నా అభినందనలు. మొగలి పొదలు సీరియల్ బాగుంది.

వేమకోటి సీతారామశాస్త్రి, (శ్రీకాకుళం)

* * *

దేవిరాణి ముఖచిత్రంతో వెలువడిన ఈవారం పత్రిక నాకెంతో ఆహ్లాదాన్ని కల్గించింది. సీరి యల్స్ రెండూ చక్కగా ఉన్నాయి.

ఈ వారం జయప్రద గారు వ్రాసిన 'పరమ పద సోపానము' అనే కథ నన్నెంతగానో ఆకర్షిం చింది. అంతస్తు, ఐశ్వర్యం ఉండి కూడా అనురాగ పూరితమైన జీవితాన్ని పొందలేని సాధనిని తలచు కుంటే నాకు చాల జాలివేసింది. కథలో క్రొత్త దనాన్ని చూపించిన రచయిత్రికి నా అభినందనలు!

కొంకలవారి భారతి, (నర్సీపట్నం.)

* * *

6—7—68 పత్రికలో ప్రచురించిన "పరమపద సోపానము" కథ బాగుంది. అందులో కొన్ని సంఘటనలు హృదయానికి హత్తుకున్నాయి. సాధనికి మోహనా విధించిన శిక్ష నాకు ఎంతో నచ్చింది. అలాంటి సమాధానం వస్తుందని నేను వూహించాను. కథ పూర్తిగా చదివినాక అది విజ మయింది. అతని సమాధానం తనకు సాధని వినాద వుండే గౌరవానికి మెరుగులు దిద్దింది. రచయిత్రి జయప్రదగార్కి నా అభినందనలు.

పార్వతం చిన వెంకటేశ్వర్లు, (చిలకలూరిపేట)

* * *

26—7—68 వ తేది పత్రికలో "పరమ పద సోపానము"— అను కథ బాగుంది.

"రాగమయి' సీరియల్ నవల చాల బాగుంది. ఈ వారము (26—7—68) కథ మలుపు తిరిగింది. తుదకు భానుమతి జీవితము., 'రాగ మయి— కాగలదని నా నమ్మకము (వూహ). మంచి నవల అందించిన మీకు, రచయిత్రిగార్కి నా అభి వందనలు.

ముత్యాల సత్యనారాయణరెడ్డి, (వంకంచెర్ల)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 16—8—'68
కీలకనామ సం॥ శ్రావణ మాసం బ॥ అమావాస్య

సంపుటము : 60 సంచిక : 49

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్ర రచన — శ్రీ గెనిశెట్టి.


జెన్ వారిని
ఇష్టంవచ్చినట్లు
చెయ్యనివ్వండి.
తరావాత మాకే
అనుభవిస్తారు
జెకోస్లొవేకియా
వ్యవహారంలో
కలిగించుకుని
ప్రపంచానికి
రష్యా
ఏ దారి?
రెండూ ప్రమాదాలే!


న్యాయం నిన్ను
రక్షించదు!
పంజాబ్ పై సుప్రీం కోర్టు తీర్పు


విరాళాలివ్వడం
నేరమయితే?
పార్టీలకు
కంపెనీ
విరాళాలపై
చట్టం
రాజకీయ నాయకులు
వ్యాపారస్తులు
నల్లధనం


మైనారిటీ వర్గాలకు
మీరు అన్యాయం
చేస్తున్నారు మాడమ్.
మైనారిటీల
పై పాక్
ఆరోపణ!

ఢిల్లీ లేఖ

# రష్యా-పాకిస్తాన్:
# రష్యా-చెకొస్లొవాకియా: కొన్ని గుణపాఠాలు

ప్రస్తుతం జరుగుతున్న వార్తాపత్రికలలో వస్తున్న సోవియట్ రష్యాకి బాగా పనికి వస్తోంది. పత్రికలు చాలా ఆగిపోవటంతో పార్లమెంటులో రష్యా-పాకిస్తాన్ ఆయుధాల వ్యాపారం గురించిన చర్చల వార్తలకి సరయిన ప్రచారం లభించటం లేదు. ఇక చెకొస్లొవాకియామీద రష్యా వత్తిడి వార్తలు బాగా మరుగున పడిపోయాయన్నా ఆశ్చర్యంలేదు.

కమ్యూనిస్టులు. భారతదేశంలో వారి 'స్నేహితులు' సామ్రాజ్యవాదాన్ని. సామ్రాజ్యవాదులని తిట్టిపోయని రోజు లేదు. అయితే రష్యా సామ్రాజ్యం కథ మాటేమిటి?

**పోలండ్:**

1956 లో గోముల్కా నాయకత్వాన ఈ తూర్పు యూరోపియన్ దేశం స్టాలిన్ ప్రభావాన్ని తగ్గించాలని చూసింది. 1960 నుంచి తిరిగి గోముల్కా నాయకత్వం కిందనే తిరోగమనం ప్రారంభించింది. విద్యార్థి ఉద్యమాలని అణచివేసింది. చెక్ సంస్కరణలని ఖండిస్తోంది.

పోలండ్‌లో రెండు రష్యన్ సైనిక దళాలు ఉన్నాయి; ఇవికాక అదనంగా మరొకరకం దళాలు 16 ఉన్నాయి.

**తూర్పు జర్మనీ:**

ఇది రష్యా బానిసలలో అత్యంత విశ్వాసపాత్ర మయినది. చెక్ సంస్కరణలు తమకి ప్రమాదకరమని ఈ దేశం పరిపాలకులు భయపడుతున్నారు. తూర్పు జర్మనీలో 20 రష్యన్ దళాలు ఉన్నాయి.

**హంగేరీ:**

1956 లో రష్యా తనని ఎదిరించిన విప్లవవర్గాన్ని నిర్మూలించి పారవేసింది. కాడార్‌ని తమ బంటుగా నియమించింది. హంగేరీలో 4 రష్యన్ దళాలు ఉన్నాయి. అదనంగా మరొక నాలుగు దళాలు ఉన్నాయి.

**రుమేనియా:**

1964 లో ఈ దేశం, రష్యా అధికారం నుంచి కొంత తప్పించుకుంది. పాశ్చాత్య దేశాలతో సంబంధ బాంధవ్యాలు ఏర్పరచుకుంది. చెకొస్లొవాకియాలో రష్యా జోక్యాన్ని ఖండించింది.

**యుగోస్లావియా:**

1948 లో ఈ దేశం స్టాలిన్ తో పోట్లాట పెట్టుకుని విడిపోయింది వార్సా ఒప్పందంలో సభ్యత్వాన్ని వదులుకుంది. ఈ దేశ నాయకుడు మార్షల్ టిటో ఈవారం ప్రాగ్‌కి వెళ్లవచ్చు.

**బల్గేరియా:**

ఈ దేశంలో నియంతృత్వం సడలింది. చెక్ సంస్కరణలని మాత్రం బల్గేరియా ఎదిరిస్తోంది.

**చెకొస్లొవాకియా**

1948 దాకా స్టాలినిస్టు విధానాలని అనుసరించారు. ఈ ఏడు జనవరిలో పార్టీ నాయకుడు నొవోట్నీని పదవిలో నుంచి పంపించి వేశారు అతనిసహచరులు. స్వేచ్ఛని సంపాదించే సంస్కరణలే నేటి క్లిష్ట పరిస్థితికి దారితీశాయి.

వీటిని చెక్ నాయకులు ప్రతిపాదిస్తూ ఉండగానే రష్యా తన దళాలని కదిపింది. అయితే చెకోస్లొవాకియా కూడా 'పోరాడటానికి' సిద్ధంగా ఉంది. ఇక రాజధాని ప్రాగ్‌లో ఈ విషయం మీద వాద వివాదాలు జరుగుతున్నాయి. గుంపులు గుమికూడి చర్చలు కొనసాగిస్తున్నాయి. ('రష్యా అంటే మనకి భయమా?' అని అడిగిందిట ఒక యువతి 'లేదు!' అని ఒక కంఠంతో అరిచారుట ఆమె శ్రోతలు. 'ఆయుధాలతో ఎంత కాలమని స్వేచ్ఛని నెలకొల్పగలం?' అని ఒక నడివయస్కుడు అడిగాడుట)

సోవియట్ అధికారుల కోరికలు కఠినంగా ఉన్నాయి. వార్సా ఒప్పందం కింద కొన్ని దళాలని చెక్ ఎల్లలమీద ఉంచాలి, సోషలిజం ఎదిరించే కొందరు చెక్ నాయకులని తొలగించాలి అంటున్నారు.

**ఆర్థిక సామ్రాజ్యం**

సైనికుల మాట అలా ఉంచి ఆర్థిక విషయాలని పరిశీలిస్తే ఇంకా ఎన్నో ఇబ్బందులు బయట పడ్తాయి. 1948 నుంచి రష్యా తూర్పు యూరప్‌ని బాగా తనకి లొంగేట్లు చేసుకుంది. చెకొస్లొవాకియా వ్యాపారంలో ముప్పాతిక రష్యాతోనే. అంటే రష్యా ఆధీనంలో ఉందన్నమాట.

దీనివల్ల మనకి తెలిసేదేమిటంటే, 50 ఏళ్ల సోషలిజమ్ తర్వాత కొంత స్వేచ్ఛ రాగానే ప్రజలు సోషలిజాన్ని వదిలి వెళ్లిపోతారనే భయం రష్యాకి ఉందన్నమాట.

**రష్యా భక్తులు**

భారతదేశానికి ఒక కొత్తదారి కనిపించే అవకాశం కలిగింది శ్రీమతిగాంధీ ప్రధాని అయిన తర్వాత ఆమె అనుచరులు ఇద్దరు శ్రీయుతులు దినేష్‌సింగ్, ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్‌లు—పూర్తిగా మాస్కో భక్తులుగా మారిపోయారన్న సంగతి అందరికీ తెలిసినదే, వీరి భక్తి కొన్నిసార్లు రష్యాకే ఇబ్బంది కలిగిస్తూ ఉంటుంది. ఇస్లామ్ భక్తులు మక్కా వయిపు తిరిగినట్లు శ్రీమతిగాంధీ నడమంటి ప్రభుత్వం మాస్కోవయిపు తిరుగుతుంది. రష్యా సలహామీదనే కాంబేలో నూనె పరిశోధనని అమెరికా కంపెనీ ఒక దానికి ఇవ్వలేదు. రష్యా వత్తిడిమీదనే మాజీ కాశ్మీరు మహారాజా కరణ్‌సింగ్ నష్టదాయకమయిన రష్యన్ విమానాలని ఇండియన్ ఎయిర్‌లయిన్స్‌కి కొందామా వద్దా అని చర్చలు జరిపారు. రష్యా పాకిస్తాన్‌కి ఆయుధాలు అమ్ముతున్నదన్న వార్త బయట పడ్డప్పుడు శ్రీమతి గాంధీ అనుచరులలో సంచలనం కలుగలేదు.

## శ్రీ కొసిజిన్ కోపం...

పశ్చిమజర్మనీ, ఇరాన్, ఇటలీ లేక బ్రిటియన్‌లని పాకిస్తాన్ ఆయుధ సామగ్రి కోసం అడగగానే శ్రీమతి గాంధి 'ఇది భారతదేశంతో స్నేహానికి విరుద్ధం' అని అండిస్తారు; అంతేకాక, భారతదేశానికి అది హాని కలిగిస్తుందంటారు. కాని, రష్యా పాకిస్తాన్‌కి ఆయుధాలని ఇస్తే, అదే శ్రీమతి గాంధిగారు ఇంతమాత్రం ఆయుధాల సరఫరావల్ల భారతదేశం పాకిస్తాన్‌తో పోరాడినా తట్టుకోగలదు అని వాదిస్తారు. పార్లమెంటులో జరిగిన చర్చలో ఆమె తాపత్రయం అంతా రష్యాకి కోపం రాకూడదనే, కొసిజిన్‌కి కోపం రాకూడదనే.

చెకోస్లొవాకియా అంతరంగిక పరిస్థితులలో రష్యా జోక్యం కలిగించుకుంటోంది. కాని, ఈ విషయంలోనూ శ్రీమతిగాంధీ ఆదుర్దా రష్యాకి కోపం రాకుండా చూడాలనే

భారతదేశం, ఈజిప్టు, యుగోస్లావియాలు ఒక మిత్రత్రయం అంటారు; యుగోస్లావియా పూర్తిగా చెక్ సంస్కర్తలవే బలపరుస్తోంది. మార్షల్ టిటో ప్రాగ్‌కి వెళ్లి అక్కడి వారికి ధైర్యం చెప్తారని వార్త వెలువడింది భారత దేశం వైఖరికి దీనికి ఎలా పొసగుతుంది?

## తిరోగమనం

కమ్యూనిస్టు దేశాలలో అధికారం కేంద్రీకృతం కాకూడదు. అనే సిద్ధాంతం బలపడుతోంది, భారతదేశంలో అధికారాన్ని మరింత కేంద్రీకరిస్తున్నారు. కమ్యూనిస్టు యూరప్ 'మార్కెట్ పద్ధతి ఆర్థిక వ్యవస్థ' వయిపు మొగ్గుతోంది, కంట్రోళ్లు తగ్గించి పోటీని అధికం చేస్తున్నారు. భారతదేశంలో ప్రభుత్వరంగాన్ని విస్తృతం చేస్తున్నారు. పోటీ నశిస్తోంది.

కమ్యూనిస్టు రాజ్యాలు క్రమంగా పాశ్చాత్యదేశాలతో వ్యాపారాన్ని అధికం చేసుకుంటున్నాయి. తమ విదేశ మారకాన్ని ఎక్కువ చేసుకుంటున్నాయి. భారతదేశం కమ్యూనిస్టుదేశాలతో 'బదులు వ్యాపారం' ఎక్కువ చేసుకుంటోంది. భారతదేశం ఆర్థిక పరిస్థితిని చక్కపెట్టుకొనమని ప్రపంచబాంకు సలహా ఇస్తే అది నియంతృత్వం అంటారు. అదే రష్యా గమక ప్రభుత్వ పత్రిక 'ప్రావ్దా' ద్వారా సలహా ఇస్తే అది నిర్మాణాత్మకమయిన సలహా.

## నెహ్రూ జాగ్రత్త

మొదటినుంచీ భారత కమ్యూనిస్టులు (కాంగ్రెసు బయటా, లోపలా) ఒక విధానాన్ని అనుసరిస్తున్నారు—క్రమంగా భారతదేశాన్ని పాశ్చాత్య దేశాలకి దూరంచేసి రష్యాకి వొప్పచెప్పే విధానం. పండిత నెహ్రూకి ఈ విధానంలోని ప్రమాదాలు తెలుసు. అందుచేతనే భారతదేశం ప్రజాస్వామ్య మార్గాన్ని అనుసరించే దేశం అని నొక్కిచెప్తూ ఉండేవారు. శ్రీ శాస్త్రి కూడా ఇదే పద్ధతిని అనుసరించారు కాని ఆయన అకాలంగా మరణించారు. శ్రీమతి గాంధీగారి తటస్థ విధానం పశ్చిమ దేశాలతో సహకార నిరాకరణ, రష్యాతో సహకారంగా ఉంది. దీనికి ఆవిడ ఉపన్యాసాలూ, ప్రసంగాలే నిదర్శనాలు

పోలాండ్, హంగరీ, చెకోస్లొవాకియాలు రష్యాతో వ్యాపారం అధికం కావటం వల్ల ఎటువంటి చిక్కుల్లో ఇరుక్కున్నాయో చూస్తున్నాము. ఆ ప్రమాదాలని మనం తప్పించుకోవటం అవసరం.

## విమాన ఉదంతం

విమానాల ఉదంతం గురించి మళ్లీ చెప్తున్నాము. రష్యా తయారుచేసే విమానాలు కొనకపోయినట్లయితే భారతదేశం పద్ద రయిల్వే వాగన్లు కొనమనే బెదిరింపువల్లనే ఢిల్లీలో కొంత అలజడి బయలుదేరింది. శ్రీయుతులు దినేష్‌సింగ్, ఫకురుద్దీన్ అలీ అహమ్మద్‌లు రష్యాకోసం ఇక్కడ పరిశ్రమల నిర్మాణాన్ని మార్పు కావాలని చెప్తున్నారు. మార్పు పూర్తి అయిన తర్వాత రష్యా హటాత్తుగా కొనటం మానివేస్తే? పెట్టుబడి ఎంతనష్టం అవుతుంది?

రష్యాలో హటాత్తుగా కొన్ని 'స్పేర్ పార్ట్‌ల' తయారీ ఆపటం కద్దు. మనం విమానాలు వారివద్ద కొన్న తర్వాత వాటికి కావలసిన పార్ట్‌లు తయారు చెయ్యటం ఆపివేస్తే మనపని ఏమికావాలి? మళ్లీ కొత్త రష్యన్ విమానాలు కొన్ని కొనాలా? '1962 నేరస్థులు' అనే పుస్తకం రాశారు శ్రీ డి. ఆర్. మంకేకర్. ఆయన గాని, మరెవరయినాగాని, దానికి తరువాయిగా వచ్చే పుస్తకం రాసే సన్నాహాలు మొదలు పెడితే మంచిది.

—శ్రీకృష్ణ

# బాలల్లారా రండి!



పాఠశాలకు పోయి
పాఠాలు నేర్చేము
రండి బాలల్లార రండిరారండి
బాల బాలికలార రారండి రండి!!

శాల లన్నిటిలోన
పాఠశాలే మంచి
నీడ మనకిచ్చేను
జాడ చూపించేను॥

చక్కని దుస్తుల్లో
చుక్కలను చూపించి
మక్కువలు మీరగా
గ్రక్కునా పోదాము॥

పరుగు పరుగున మనము
పందాలు వేసుకుని
కుందేలులా కాక
ముందె పోయుందాము॥

బడిలోకి పోగానె
బడిగంట కొడతారు
బడి చప్పుడా లేక
వరిగ నిలబడదాము॥

'జనగణమన' యంచు
జన్మభూమిని కొలిచి
తమతమ తరగతికి
తరలి పోదాము॥

పోవునప్పుడు గాని
వచ్చునప్పుడుగాని
వరుస పాటించుదాం
సరసులై మెలగుదాం॥

మాస్టారు వస్తారు
తెలుగుకో మాస్టారు
మాతృభాషను గల్గు
మాధురిని చెబుతారు॥

మాస్టారు వస్తారు
ఇంగ్లీషు మాస్టారు
పరదేశ భాషలో
పరువు చూపిస్తారు॥

మాస్టారు వస్తారు
సైన్సుకో మాస్టారు
విజ్ఞాన లోకాన
విహరింప జేస్తారు॥

మాస్టారు వస్తారు
లెక్కలా మాస్టారు
చిక్కులెన్నో విప్పి
చక్కగా చేస్తారు॥

మాస్టారు వస్తారు
హిందీకి మాస్టారు
దేశ భాషంచును
ఆశ చూపిస్తారు॥

మాస్టారు వస్తారు
డ్రాయింగు మాస్టారు
సున్నలెన్నో చుట్టి
బొమ్మగా చేస్తారు

మాస్టారు వస్తారు
చరిత్రకో మాస్టారు
కథలు కథలుగ వీర
గాథలను చెబుతారు॥

మాస్టారు వస్తారు
భూగోళ మాస్టారు
భూమి అంతా ఒక్క
గోళమని చెబుతారు॥

లెఖ్ఖలకై ఒంటిగాను
డ్రిల్లుకో మాస్టారు,
సరిగమా పదనిస
సంగీత మాస్టారు॥

ఎందరెందరో వచ్చి
మందమతుల విదిల్చి
కథలు గాధలలోన
వధము చూపిస్తారు॥

వ్రాతలో నొచ్చినా
ఆటలో అలసినా
పాటల్లో మురిపించి
పాఠాలు చెబుతారు॥

భూలోక స్వర్గమౌ
భావి భాగ్యమ్ముకై
బాట చూపే బడికి
వీటుగా రావయ్య॥

బడిగంట కాగానె
బయటపడి మనమంత
ఆడుతూ పాడుతూ
అమ్మదరి కొద్దాము॥

సంతోష సాగరం
ఉల్లాస వనముగా
ఉన్న మన శాలకు
మళ్ళి పోయొద్దాము॥

రేపు మాపూ వెళ్ళి
గొప్పవాళ్ళము కాగ
చక్కగా పాఠాలు
చదువు కుందాము॥

దేశరక్షణ కొరకు
ధీరులము అవుదాము,
జనుల కోరిక మీద
జహ్వారుల మవుదాము॥

తల్లిదండ్రుల మాట
తలదాల్చి మనమంత
గురువువాళ్ళందు
గౌరవము చూపుదాం!

భాష వేర్వేరన్న
భావమ్ము మనకొద్దు
అన్నిదిక్కుల మన్న
అన్నదమ్ములమయ్య!!

మన అమ్మ భారతికి
మనసార హారతులు
ఇచ్చి గైకొందాము
స్వచ్ఛమౌ దీవనలు॥

పాఠశాలకు పోయి
పాఠాలు నేర్వేము
రండి బాలల్లార రండి రారండి
బాలబాలికలార రారండి రండి॥

## నెం. 37 18 క్లూలు

1 మగుణము లేకుండా మరియు సామర్థ్యం/ కార్య లేకుండా ఏదిన్నీ సాధింపబడనేరదు.

2 భూతలంనుంచి అధిక సంపాదనేచ్ఛ/ అధికార ప్రాబల్యతాపేక్ష గల ద్వేషపూర్ణ భావం తొలగింపబడక పోతే ప్రపంచంలో ఎట్టి నిర్దిష్టమైన వ్యవస్థయున్ను సృష్టింపబడజాలదు.

3 నిర్బంధము/ సంశయము అసలైన ధర్మాభివృద్ధికి విరుద్ధం.

4 జీవనం సంచితపరచదు గాని జీర్ణించుకొనును, రచింపదు కాని వూహించును/ సృష్టించును.

5 లోకతంత్రంలో సామాజిక చైతన్యం/ సంతుష్టి గలదు ప్రథమ దృష్టిలో బాహ్యంగా గోచరం కాదు గాని అంతర్గతమై యున్నది.

6 సంస్థలు వ్యక్తుల నావరించుకొని పెంపొందును గొప్ప భావనలు గల మరియు ఘనకార్యములొనర్చె/ (ఘన) స్వప్నములుగల వ్యక్తులు అనే అంశం ఇతిహాసిక ప్రసిద్ధసత్యం.

7 భౌతికరంగంలో విజ్ఞానం దేని ఋజువు పరచుచున్నదో అది, ఆధ్యాత్మికరంగంలో ధర్మం వల్ల నిశ్చితంగాను/పూర్తిగాను ఋజువు పరచబడింది.

8 కేవలం స్వాతంత్ర్యం/ వివేకం మనుష్యుని యంత్రానికి మించిన ఉన్నత స్థానానికి లేవనెత్తుతుంది, సృష్టిశీలత పునరావర్తన అగత్యతను అధిగమింప చేస్తుంది.

9 దేశమందలి క్లిష్ట ఆర్థిక సమస్యల గురించి యదార్థపూర్ణ సమీకరణ హెచ్చింపు/ పన్ను విధి పు సమస్య పరిష్కారానికి ప్రముఖ ప్రాధాన్యత నిస్తుంది.

10 అసూయలు/ దురభిమానములు వనితల యందే గాక పురుషుల యందు కూడా బహు ప్రయాసతో అంతరించును.

11 మనము శిక్షణయందు ఆనందానికి/ క్రీడలకు అవకాశం యివ్వము. అది అత్యంత అవసరం.

12 మన జీవన భస్మములనుండి ఒక నూతన వ్యవస్థ, అందరికోసం శాంతి మరియు న్యాయ/ప్రగతిదాయక వ్యవస్థ ఉద్భవించుగాక.

13 ఖచ్చితంగా ప్రతి వారికీ ఏవో సిద్ధాంతాలు తప్పు, ఒప్పు అయిన వివేకం ఏదో వుండాలి కాని మీరు ఎక్కడ చూచినాసరే కేవలం నీచత్వం స్వార్థం/ మరియు విశ్వాసఘాతకం తాండవిస్తుంటుంది.

14 నిజమే, ఈనాటి పరిస్థితి బట్టి చూస్తే జనులకివ్వటానికి మన వద్ద ఏమీలేదు. దయ/ దరిద్రం తప్ప పంచిపెట్టుట కింకేమీ లేదు.

15 యువకులు దుర్వ్యయ/భావగర్భిత ప్రియులగుట ఎక్కువగా సంభవనీయం.

16 మార్గం కఠినమై యున్నది, కాని మనం నివసించుచున్న కాలం మాద్యుతో వృద్ధిబొందే యుగంలో శాంతి, సంపన్నత/సురక్షితం మరియున్యాయంకోసంఏమీసులభమార్గంలేదు.

17 విజ్ఞాన/సఫలతా యుక్తమార్గము నవలంబించి అందు పురోవృద్ధి గావించుటకు మనం తృప్తి తో నిండిన సంతోషమును విసర్జించవలసి వుంటుంది.

18 సమాజం తాను వాంఛించే దానిని/ అమూల్య [illegible]

## No. 37: 18 CLUES

1. Without merit and without Ability / Activity, nothing is achieved
2. The world cannot create any perfect order unless the hateful spirit of Acquisition/ Domination is eliminated from the face of the earth
3. Coercion / Suspision is opposed to genuine religious growth
4. Life does not store up but assimilates, does not construct but Conceives / Creates.
5. Democracy has a social Conscience / Content which is not obvious at first sight but is inherent in it.
6. It is a well-known fact of history that institutions grow around persons-persons of broad vision and great Deeds / Dreams.
7. What science proves in the material sphere is Finally/Fully proved by religion in the spiritual world.
8. Freedom / Wisdom alone raises Man above the Machine, the creative Spirit above cyclic necessity
9. A realistic approach to the country's pressing economic problems would give top priority to the solution of the problem of Inflation/ Taxation.
10. Jealousies / Prejudices die hard not only among women but also among men
11. We do not make room for Joy / Play in education. That is a great need
12. From the ashes of our lives may a new order arise an order of peace and Justice / Progress for all.
13. Surely one must have some principles, some sense of right and wrong But wherever you look, all you see is Meanness / Selfishness and dishonesty.
14. True, as things stand we have nothing to give to the people, nothing to distribute except Pity / Poverty.
15. Youth's apt to be Prodigal / Sentimental.
16. The road is hard, but in the revolutionary age in which we are living there is no short cut to peace, Prosperity /Security and justice.
17. To be on the path of Science/ Success and to accelerate the pace of our march thereon requires us to cast off complacency.
18. A society tends to develop what it Values Wants.

గమనిక: పై క్లూలు భారతీయ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు, అఫిషియల్ సొల్యూషన్‌తోపాటు వచ్చే సంచికలో ప్రచురించబడును.

ఒకవారంవిపరీతం

## భర్త అప్పు తీర్చ లేని భార్య ఆత్మహత్య

భర్త వద్ద అప్పు చేసి, అన్నకొడుకు కిచ్చివేసిన కామాక్షి అమ్మాళ్ అనే ఆమెను, "వెళ్ళి ఆ డబ్బు తీసుకురా, పో" అని భర్త తరిమేశాడట. కామాక్షి అమ్మాళ్ అన్నకొడుకు యింటికి వెళ్ళి అడిగితే మూడునెలల్లో యిచ్చేస్తానన్నాడట. ఆరాత్రి ఆమె అన్నకొడుకు యింటి వసారా దూలానికి పైట చెంగుతో వురిపోసుకుని చనిపోయిందట—అంతే.

## ఎలుక తోక తెస్తే అప్పు

మణిలాలో బ్యాంకువాళ్ళో వింత పద్ధతి పెట్టారట. అప్పుకావలసిన వాళ్ళు ఒక ఎలకతోక తెచ్చి బ్యాంకులో యివ్వాలట. అలా తోక యిచ్చినవారికే




అప్పులిస్తారట. అప్పులు కావలసిన వారంతా ఎలుకల వేట ప్రారంభించారట. దేశంలో పంటలు నాశనం చేస్తున్న ఎలకలను నాశనం చెయ్యడానికి యిది ఒక మంచి మార్గం అని ఆ దేశం వూహిస్తోంది.

* * *

నలుగురు పిల్లల తల్లి అయిన తనను భర్త ప్రతి చిన్న విషయానికి కసురుకోడం, తిట్టడం, అవమాన పరచడం సహించలేదని జీవితంమీద విరక్తి కలిగి మెరూన్‌బీ అనే ఆమె తన పిల్లలను చంపి, తను ఆత్మహత్య చేసుకుందట. పిల్లలకు కడుపునిండా అన్నం పెట్టి, ఏదో మిషతో నూతిదగ్గరకు తీసుకువెళ్ళి, గమ్మున ముగ్గురు పిల్లల్నీ నూతిలో తోసి, పసికందును తన ఒళ్ళో చీరకు కట్టుకుని, తనూ దూకేసిందట. శబ్దానికి చుట్టుప్రక్కలవారు వచ్చి శవాలను బయటికి తీశారు. ఎంత మానసిక బాధ అనుభవించక పోతే యింత దారుణం ఆమె చెయ్యగలదు! ఇది కృష్ణగిరి తాలూకా పోదవాంపేటలో జరిగింది.

— [illegible]

# బొమ్మల నుడికట్టు

దిగువ ఉన్న నుడికట్టులో కొన్నిటికి ఆధారాలు యిచ్చాము. మరి కొన్నిటికి ఆధారాలతో పాటు బొమ్మలుకూడా ఉన్నాయి. మిగతా వాటిని మాత్రం బొమ్మలని చూసి నింపాలి. కొన్ని గళ్లలో అక్షరాలు ఉన్నాయి కనుక ఆ మాటలని కనిపెట్టటం మరింత తేలిక!



## ఆధారాలు

**అడ్డం:**

3. [illegible] యిదంటే సరదా
5. దక్షిణ భారతదేశంలో ఉన్న ఒక [illegible]
6. [illegible]
7. [illegible] ఉంటే యిలా [illegible]

**నిలువు:**

2. సంతోషానికి మరోమాట.
6. రూపాయిలో నాలుగోవంతు.
8. మనిషి బందుకీలు ఉండే శరీర భాగాలలో ఒకటి.
13. వాద్య విశేషాలలో ఒకటి.

([illegible] 64 పేజీలో)

# చరిత్రలో మీ పరిజ్ఞానం?

1. అశోకుని పరిపాలన ప్రారంభం అయిన సంవత్సరం?
   అ) క్రీ. పూ. 326
   ఆ) క్రీ. పూ. 273
   ఇ) క్రీ. పూ. 27
2. గుప్తయుగం ఎప్పుడు మొదలయింది?
   అ) క్రీ. శ. 375
   ఆ) క్రీ. శ. 528
   ఇ) క్రీ. శ. 320
3. రెండవ పులకేశి ఏ వంశానికి చెందిన రాజు?
   అ) చాళుక్య
   ఆ) చోళ
   ఇ) శాతవాహన
4. మహమ్మద్ గజినీ సోమనాథ దేవాలయంపై దాడిచేసిన సంవత్సరం?
   అ) 1001
   ఆ) 1024
   ఇ) 1030
5. మొదటి పానిపట్టు యుద్ధం ఎప్పుడు జరిగింది?
   అ) 1526
   ఆ) 1320
   ఇ) 1565
6. వాస్కోడిగామా కోజికోడ్‌కి వచ్చిన సంవత్సరం?
   అ) 1487
   ఆ) 1510
   ఇ) 1498
7. రెగ్యులేటింగ్ ఆక్ట్ వచ్చిన సంవత్సరం?
   అ) 1761
   ఆ) 1773

ఇ) 1806

8. విక్టోరియా మహారాణి పరిపాలన భారత దేశంలో ఎప్పటినుంచి ప్రారంభం అయింది ?

అ) 1803

ఆ) 1858

ఇ) 1872

9. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ స్థాపన ఎప్పుడు జరిగింది ?

అ) 1885

ఆ) 1887

ఇ) 1904

10. ఉప్పు సత్యాగ్రహం ఏ సంవత్సరంలో జరిగింది ?

అ) 1932

ఆ) 1937

ఇ) 1930

11. పంచవర్ష ప్రణాళిక కార్యక్రమం భారత దేశంలో ఎప్పుడు ప్రారంభం అయింది ?

అ) 1951

ఆ) 1948

ఇ) 1950

12. ఇండియా–పాకిస్థాన్ యుద్ధం, తాష్కెంట్ ఒప్పందం జరిగిన సంవత్సరం ?

అ) 1962

ఆ) 1965

ఇ) 1960

(జవాబులు ఈ పేజీలోనే తలక్రిందులుగా ఉన్నాయి.)

జవాబులు :

| | |
|---|---|
| 1. క్రీ.పూ. 273 | 7) 1773 |
| 2. క్రీ.శ. 320 | 8) 1858 |
| 3. అశోకుడు | 9) 1885 |
| 4. క్రీ.శ. 1024 | 10) 1930 |
| 5. 1526 | 11) 1951 |
| 6. 1498 | 12) 1965 |

# భూగోళశాస్త్రం మీకెంత బాగా వచ్చు?

దిగువ ఉన్నది దక్షిణ అమెరికా చిత్రపటం. అందులో 1 నుంచి 13 వరకూ గుర్తుపెట్టిన అంకెలు ఆ ఖండంలో ఉన్న దేశాలు. ఆయా దేశాల పేర్లు ఏమిటో వరుసగా రాయగలరేమో ప్రయత్నించండి. మీరు రాసిన దేశాల పేర్లని ఇదే సంచికలో ప్రచురించిన సరైన జవాబులతో సరిచూసుకోండి. అప్పుడు తెలుస్తుంది భూగోళశాస్త్రం మీకు ఎంత బాగావచ్చో !

(జవాబులు 64 పేజీలో)



**బి. ఎస్. ఎన్, దార్లపూడి**

చమక్ చమక్ రామలక్ష్మి గారూ, హ్యూమరస్‌గా యుండెడి మీ సమాధానములు తిలకించ ఆహా ఎంతటి చమత్కారి మీరు, అనిపిస్తుంది. ఇంతకీ మీది ఏ కాలేజీ విద్యాభ్యాసం.

పంపేశారు ఉపసర్పంచ్‌గారూ! కాలేజీలో ఇవన్నీ నేర్పుతారనా!.....అడిగారు కనుక చెప్తున్నా—నాది బొత్తిగా 'నన్నుల' చదువు—స్కూల్లో.

**బి. వి. ఎ ఆర్, వైమానికదళం**

నేనొక అమ్మాయిని ప్రేమించాను. ఆమె కూడా నన్ను మనసారా ప్రేమించింది. మా తల్లిదండ్రుల మధ్య మనస్పర్థం ఏర్పడ్డాయి మా పెళ్ళికి ఒప్పుకోవడం లేదు.

వయస్సు ఉండి, అర్థికంగా ఎవరిమీదా ఆధార పడే స్థితిలో లేకుండా ఉంటే—హాయిగా రిజిస్ట్రారు ముందు వివాహం చేసుకోండి—గుళ్ళో కాదు! తర వాత పెద్దలు — దారికి వారే వస్తారు.

**డి. ఎస్, జొన్నాడ**

పి రామలక్ష్మి కె. రామలక్ష్మి ఒకరేనా? కారా?

కారు సోదరీ, అందుకే పి. రామలక్ష్మిని అర్పణ రామలక్ష్మి అంటూ ఉంటాను నేను. అది నాకు నచ్చిన నవల.

**బి. వి. పి, కర్నూలు**

నేటి దినములలో కుటుంబనియంత్రణ ఎక్కువ ప్రచారంలో ఉంది కాని కవీశ్వరుడైన రవీంద్రనాథఠాగూరు తన మాతా పితలకు పదునాల్గవ సంతానంగా ఉద్భ వించాడు. కనుక ఈ కుటుంబ నియంత్రణ వల్ల ఇటువంటి మహానుభావుల నెందరినో దేశము కోల్పోవును కదా?

అందుచేత?!....ఠాగూరు పద్నాలుగో వాడైనా మేధావి అయ్యాడు సరే. కాని కుచేల సంతానానికి ప్రతిరూపణ అతడు కాదు — అర్ధాకలితో, అనారోగ్యంతో, జీర్ణవస్త్రాలతో, లేమితో సతమతమై పోయే — కంది, మధ్య తరగతులను చూడండి మహానుభావా, ఓ మేధావి దేశానికి కొరవడినా యిబ్బంది లేదుకాని మిలియన్లకు ఆహారం లేకుండా చేయడం — దారుణం కదా?

**కె. వి. ఎ, సీతారాంపురం మైన్సు**

ప్రభుత్వంవారు కుటుంబనియంత్రణ జనాభా తగ్గించడంకోసం మొదలుపెట్టారు కదా? మరి డాక్టర్లు గుండె మార్పు చేయడం ఎందుకు చెప్పండి?

జనాభా తగ్గాలని రోగాలకి మందులు కనిపెట్ట వద్దనా మీ ఉద్దేశ్యం? కుటుంబ నియంత్రణా ప్రణాళికలు — 'పుస్సుకుండాను' సైంటిఫికల్




ప్రోగ్రెస్ 'బతికున్నవారి' కోసం రెండింటికీ కలవ కండి ఆచార్యా!

**కె. వి, సోమదేవరపాలెం**

స్త్రీకి విద్య అవసరమని నేనూ అనవసరమని మా మిత్రుడూ వాదించుకుంటున్నాం. మీరెవరితో ఏకీభవిస్తారు?

త్రేతాయుగంలో ఉన్నట్టున్నారు — మీలో ఎవరితోనూ ఏకీభవించలేను — లేకుంటే యింకా ఇటువంటి వాదన లేమిటి? హాశ్చర్యం!

**యస్. ఏ, రావినూతల**

రచయిత్రి గృహిణిగాను, మాతృమూర్తిగాను తన బాధ్యతలను పూర్తిగా నెరవేర్చ లేదని నా మిత్రుని వాదన.

కావచ్చు: అప్పుడు ఏ 'కళా' లేని రాని ఆడదాన్ని చేపట్టమని మీ స్నేహితునికి చెప్పండి.

**ఎమ్. ఆర్. ఎమ్, మద్రాసు**

నేటి పాపలే రేపటి పౌరులంటారు. అయితే నేటి పౌరులు రేపటి...?

వృద్ధులు

**కె. ఎన్. డి, రేపల్లె**

నేడు ఏ పత్రికలో చూసినా స్త్రీల సమస్యలు, స్త్రీల హక్కులు, సమానత్వం మొదలైన వాటన్నిటి పైనా స్త్రీపురుషులు ఏకంగా వ్యాసాలు బాగా రాసేస్తున్నారు కదా, అందువల్ల వాటికేదైనా పరిష్కారం లభిస్తున్నదా?

వైద్యుడిచ్చిన మందులాగా యీ వ్యాసాలు రోగం కుదర్చకపోవచ్చు. కాని వీటిని గురించి అందరూ ఆలోచించడం, చర్చించడం జరుగుతుంది కదా. మూసిపెట్టి వుంచడం కంటే వీటినిలా నలుగురి నోళ్ళా పడేలా చేయడం ఓరకంగా సమస్యా పరిష్కారానికి దోహదకారి కావచ్చును.

**టి. ఎమ్. ఆర్, హైదరాబాదు**

మేరువు కొండ దగ్గరకు వెళ్ళినా దరిద్రుడు భాగ్యవంతుడు కాలేడు. ఎందుచేత?

తలరాత కూడా ఉండాలి కదా—అందుచేత, ఇది ఎంతవరకూ అంటారా? అది మారే దాకా అంతే.

**పి. ఎస్. ఎమ్, చిట్వేలి**

'సంసారం సాగరం' అంటారుకదా మరి అనేకమంది యీ సంసారాన్ని స్వీకరిస్తున్నా రెందుచేత?

ఈది చూస్తే ఎలా ఉంటుందో అన్న మానవ దౌర్బల్యం చేత.

**కె. వి. ఆర్, బరంపురం**

నాకు పెళ్ళి అనే రొంపిలోకి దిగకుండా జల్సాగా ఉండాలని ఉంది. కాని మా అమ్మ పెళ్ళిచేసుకోమని వేధిస్తుంది. ఏం చేయను?

మీ కోరిక తెలియచెయ్యండి.

**వి. ఎస్, కొత్తపేట**

మానవుని జీవించి యున్నంతవరకూ అతనిని నీడలాగా వెంటాడేవి ఏమిటంటారు?

నీడల్లాగా అప్పులూ, ఆదాయాలూ....

**జి. ఏ. ఆర్, పోలవరం**

వాట్ యీజ్ ఏస్ ఎక్స్ సైక్లోపీడియా?

అదొక విజ్ఞాన సర్వస్వం.

**వి. ఆర్, మారుటేరు**

ఎక్కువ స్నేహం ఉన్నచోట గొడవలు వస్తాయి ఎందుచేత నంటారు?

వ్యక్తిత్వాలని గౌరవించుకోవడం మానేసిన నాడే అటువంటి స్నేహం దగ్గర గొడవలు వస్తాయి.

**వి. వి సాచ్. ఆర్, ఇచ్ఛాపురం**

మనసు విరిగితే కలవ దంటారు. అది కలవాలంటే?

విరక్కుండా చూసుకోవడమే.

**జె. ఎస్. కె, బరంపురం**

అక్కయ్యా ఒక్కసారి మీరు జవాబులివ్వడం మాని బావగారిచేత యిప్పించండి.

అయ్యో రతా! ఎదుటపడి ప్రశ్నల వర్షం కురిపిస్తే చినుకుకీ చినుకుకీ మధ్య నుంచి తప్పించుకు పోతారే— ఉత్తరాలకి జవాబులు కూడా యిస్తారా పిచ్చితల్లీ!

**బి. ఎల్; కె. కె; వి. ఎస్, కాకినాడ**

ఇంతమందిమీ అంత అల్లరి చేసిన వాళ్ళని ఏమీ అనలేక పోయాం.

అంతేగా ఫ్రెండ్స్. అందరు గొర్రెలు కలిసి తోడేలుని ముక్కచెక్కలు చేసి ఉండొచ్చు—అవి గొర్రెలు కాకుంటే!! ఏమంటారు?




**జరిగిన కథ**

రెండో పెళ్లివాడయిన గోపాలంతో సుభద్రకి పెళ్లి జరిగింది. అతనికి ఆమెతో వయసయిన కొడుకు శ్రీనివాస్ ఉన్నాడు. గోపాలం మరణం, శ్రీనివాస్ చదువు సుభద్రని కష్టాలపాలు చేశాయి. జగదీశ్ ఆమెని మోసం చేశాడు. తత్ఫలితంగా ఆడపిల్లని కంటుంది. ఫకీరు పంచలో ఆమెకి ఆశ్రయం లభిస్తుంది. రాజేశ్వరి శ్రీనివాస్‌ని వెతుక్కుంటూ వస్తుంది. ఇద్దరూ పెళ్లి చేసుకోవాలనుకుంటారు.

---

# 10

శ్రీనివాస్ యీ మధ్య ట్యూషన్లు ప్రారంభించాడు. బి. యస్. సి. బి. యి. డి. పాసయ్యాక, ఎస్సెల్సీ పరీక్షకు కూర్చునే వాళ్ళూ పి. యు. సి. కి కట్టే వాళ్ళు యిలా ఒకరొకరుగా పదిమంది పోగయ్యారు. చాలా మటుకు ఆడపిల్లలే అతని దగ్గర చనువుగా యింటికి వచ్చేవారు.

రాజేశ్వరి ప్రొద్దంతా వాళ్ల స్నేహంతో, శ్రీనివాస్ ప్రేమతో గడిపేస్తుంది. పెళ్లి అయాక ఆరోజు అడిగింది అతన్ని! 'ఇవాళ సినిమాకు వెడదాం' అని.

'వద్దు రాజేశ్వరీ'

'యేం యిప్పుడు కూడా నలుగురూ నాలుగు మాటలు అంటారా? మీరు తలెత్తుకోలేక యేమో యేమో అయిపోయి'

'అదేం లేదు'

'మరి'

'నెలాఖరులో సినిమాకు బయలు దేరుతే కష్టం కదా అనే మాటకి అన్నాను.'

'అంటే ఫస్టుతారీఖున తీసుకు వెడతా రన్నమాట!'

'వూఁ'

'యిటువంటికి చాలా ఫస్టులే వెళ్లాయి. మీరు చూపించిన సినిమాలకి కళ్ళు దెబ్బతిని వొళ్ళు తిరిగి పోతుంది'

'నన్ను చెప్పకు రాజేశ్వరి'

'హైదరాబాదుకి వచ్చాక ముద్దుగా యేనాడైనా తీసుకు వెళ్లారా మీరు గుండెలమీద చేయి వేసుకుని చెప్పండి. వరంగల్‌లో వున్నంతకాలం వీళ్ళూ వాళ్ళూ అంటారన్నారు. నిజమే. వొక్క సినిమాకు వెళ్లినంత మాత్రంతో వున్న యెస్టేటు తరిగిపోదు'

'అన్ని మాటలెందుకు రాజేశ్వరీ, నీకు వెళ్లాలనుంటే తప్పకుండా వెళ్ళు, నేను వొద్దనను, మనం యిద్దరం వెళ్లాలంటే మగవాళ్లలోకి వెళ్లాలి. మగవాళ్ల దాంట్లోకి వెళ్లాక సెకెండ్ క్లాసు టిక్కెట్టులో నువ్వు కూర్చోవడం నాకు యిష్టం లేదు. ఫస్టుక్లాసు టిక్కెట్లకి యిద్దరికి అయిదు రూపాయలు అవుతాయి. అవికాక బస్సు చార్జీలు. హైదరాబాదులో బస్సు అంత సులభంగా దొరుకుతో యింకా అనుకోవలసిన అవసరం లేదు. రిక్షాకి రెండు రూపాయలు రానూ — పోనూ. యింటికి రాగానే వంటయేం చేస్తావు? హోటల్లో పూర్తి చేసుకుంటె యిలా అంచ లంచలుగా యెంత డబ్బు ఖర్చు అవుతుందో ఒక్కసారి ఆలోచించు రాజేశ్వరీ'

'అయిందా వుపోద్ఘాతం. ఒక్క మాటకి గంటసేపు లెక్చరు యిస్తారు.' రాజేశ్వరి అంతవరకూ చెవులకి అడ్డంగా చేతులు పెట్టుకుంది.

'నువ్వు చెవులు మూసుకోనవసరంలేదు. నీకు అంత చూడాలని వుంటే నేను వొద్దనలేదు. నువ్వు వొక్కతివే అయితే యింత ఖర్చుకాదు'

'ఖర్చు, ఖర్చు, ఖర్చు; ఛీ! మల్లెపూల దగ్గర మంచే కానీలు లెఖ్ఖ పెట్టుకుంటూ కూర్చుంటారు. డబ్బుతో ప్రాణాలు రక్షించుకునే వాళ్లని మన మేం చేయగలం?'

'రాజేశ్వరీ'—శ్రీనివాస్ తెల్లబోయాడు.

'యేం వున్నమాటే అన్నాను. మొన్న పూలవాడిని తిప్పి పంపలేదా మీరు'

నిట్టూర్చాడు. 'ఈ హైదరాబాదులో రోజూ బస్సుచార్జీలకే రూపాయి కావలసి వస్తోంది. అక్కడికీ యెంతోమంది టీచర్లు మధ్యాహ్నం కాఫీ తెప్పించు

కుందారు. తను అది కూడా మానేశాడు. తండ్రి చేసిన అప్పు వాసితో కూడా వడ్డీ లెక్కకట్టి నిలుచున్న పాటున యిచ్చేయమని రామదాసు మనిషిని పంపాడని రాజేశ్వరికి చెప్పనుకూడా లేదు. రామదాసుకి తనం టే చాలా అభిమానం. అయినా రాజేశ్వరిని చేసు కున్నందుకు అతను పగబట్టాడు. నిలుచుని వసూలు చేయిస్తున్నాడు. రెండువందలైనా సరిగా చేతికి అందని తనకు మూడువేల రూపాయల బాకీ తీర్చడం అనేది అంత తేలిక విషయం కాదు. రామదాసే తనతో వ్యయంగా మాట్లాడాడు. రాజేశ్వరి భుజం మీద చేయివేస్తే విసుగ్గా వెళ్ళిపోయింది.

'నీకో విషయం చెప్పక తప్పదు రాజేశ్వరీ.'

'ఏవిటో అది?' రాజేశ్వరి కోపం వీసం కూడా తగ్గలేదు.

'మీ బాబాయి ఈవూరు వచ్చాడు.'

రాజేశ్వరి నిర్ఘాంతపోయింది; గొంతులో పటుత్వం తగ్గిపోయినట్లు ఆ భాగం ఏదో దెబ్బలికి హానం అయిపోయినట్లు, చాలా నెమ్మదిగా గొంతును తగ్గించేసి అంది.

'యెందుకు వచ్చాడు యిక్కడికి?'

'నిన్ను పంపించేయమన్నాడు?'

'మీరు యేమన్నారు?'

'అతను చెప్పేది విన్నాను. యేమం టాను?'

'ఇంకా యేవన్నాడు?'

'మనపెళ్ళి సరిగా జరిగిందో లేదో ఋజువు కావాలిట, లేకపోతే కోర్టుకు యెక్కుతాడుట.'

'మీరు చెప్పలేదా?'

'నేను ఒక్కడినేకాదు వెంకటేశ్వర్రావు, చంద్రవౌళి కూడా చెప్పారు.'

'ఏమని?'

'మనం ఆర్యసమాజ మతం పుచ్చు కున్నట్లు శాస్త్రోక్తంగా జరిగినట్లూ.'

'అందుకు బాబాయి యేమన్నాడు?'

'పుండాకోర్ గాడిదలంతా సవ్నాగం వన్నారు. మీరు నాకే టోపీ వెయ్యాలను కుంటున్నారేమో అదేం వీల్లేదు' అన్నాడు.

'అయితే నన్నేం చేస్తారు?' రాజేశ్వరి కళ్ళు నీళ్ళతో తడిసి పోయాయి.

'పిచ్చి రాజేశ్వరీ!' శ్రీనివాస్ ప్రేమగా దగ్గరికి తీసుకున్నాడు! మనల్ని యెవరు వేరు చేస్తారు? ఒక్క నాటికి మనల్ని విడదీయడం అనేది అంతసులభం కాదు. నేనూ నువ్వూ వొకట్రటే. రామదాసు బాకీ నాకూ తెలును. నాన్న బాకీ నేను తీరు స్తానన్నాను. శ్రీధర్ మన పెళ్ళిరోజున తీసిన ఫొటోలూ, సర్టిఫికేట్లూ చూపి రామదాసు మరి నోరెత్తలేదు. వెలకి యాభై చొప్పున కడుతున్నాను. అందుకే మనం యిబ్బందిలో యిరుక్కు పోయాం.'

రాజేశ్వరి అతని మొహంలోకి చూస్తూ అంది: 'యేమండీ నేనూ వుద్యోగం చేస్తే మన యిద్దరి సంపాదనా సరిపోతుంది. బాబాయి బాకీ కూడా తీర్చేయవచ్చును. మాట్లాడరేం'.

'వుద్యోగం! మనం ప్రయత్న చేయడం లేదనా? ఎంత అమాయకంగా అంటున్నావు. నిన్ను ఎన్ని సార్లు యింటర్వ్యూకి పంప లేదు, నేను ఎన్నిసార్లు నీతో ఆస్కాళ్ళకి రాలేదు.' రాజేశ్వరి ఆలోచనలో పడింది. నిజమే తను అనవసరంగా ఆపోహ పడింది. యెన్నోసార్లు ఎంప్లాయ్‌మెంట్ చుట్టూ





తిరిగింది. ఎక్కడ చూసినా రికమెండే షన్లూ, లంచాలు యివి తప్ప మరో మార్గం కనిపించడం లేదు. లంచం పెట్టడంగానీ, తీసుకోవడంగానీ సుతరామూ చేయడు శ్రీనివాస్. యింక రికమెండే షన్లు యెక్కడినుంచి వస్తాయి.

మెరుపు లాంటి ఆలోచన చటుక్కున మెదిలింది అవును నిరంజనంగారి ఆఫీసులో టైపు వస్తే చాలు తీసుకుంటాం అన్నారు. తనకి అంత స్పీడు లేదు కానీ టైపు చేయడం క్షుణ్ణంగా తెలుసు. రాజేశ్వరి ఆ రాత్రి చేయబోయే వుద్యోగాన్ని గురించి కలలుగంటూ, భర్తకి మర్నాటి వరకూ చెప్పకుండా యెలా నస్పెన్సులో వుంచాలో ఆలోచిస్తూ జాగారంగానే గడిపింది ఆ రాత్రంతా.

* * *

గుమ్మం తలుపులకి తాళం చూస్తే ఆశ్చర్యం వేసింది శ్రీనివాస్‌కి. యిన్నాళ్ళుగా పక్కింటికి కూడా వెళ్ళని రాజేశ్వరి యిప్పుడు యెక్కడికి వెళ్ళి వుంటుంది. చంద్రవాళి యింటికిగానీ...అలా వీళ్ళదే' శ్రీనివాస్ పరిపరి విధాల ఆలోచిస్తున్నాడు.

కిలకిలా నవ్వుతూ వెనక నుంచి భుజం మీద చేయి వేసింది రాజేశ్వరి. శ్రీనివాస్ నవ్వి లోపలికి దారి తీశాడు.

'ఎక్కడికి వెళ్ళావోయ్'

'ముందు కాఫీ తీసుకోండి'

'ఏమిటో సస్పెన్సు'

'సస్పెన్సా మరీ సస్పెన్సా ...చూడండి నేను చెప్పేవరకూ మీరు అడగకూడదు'

# మొగలి పొదలు

'అబ్బ వుండలేనోయ్'

'అయితే మానేయండి'

'అంటే వుండకుండా పొమ్మనమనా'

'ఛ!'

'మరి?'

'నేను చెబుతానన్నాగా.'

'నేనే చెప్పేస్తాను'

రాజేశ్వరి ఆశ్చర్యంగా చూసింది.

'పేరంటానికి'

కొంగు అడ్డుపెట్టుకుని నవ్వుతూ వింటోంది

'అవునా?'

'ఊహుఁ'

'పార్కుకి'

'నా బొందకి, యివేవీ కావు. మీ మాటల్లో చూడండి. డికాషన్ పొంగు కూడా వచ్చేసింది. కొంచెం వుప్మా కలియు బెట్టేసరికి కాఫీకి పాలు వస్తాయి.

'అంతవరకూ నన్నిలా సస్పెన్సులో వుండమన్నావా?'

'ఏం చేస్తాం మరి తప్పదు'

శ్రీనివాస్ కొంచెం దగ్గరగా జరిగి రాజేశ్వరి చెంపల మీద ముద్దులు కురిపిస్తూ 'నా బంగరు కొండవి చెప్పు రాజేశ్వరీ' అన్నాడు ముద్దుగా. పాలు రావడం కాఫీ కలపడం పూర్తయ్యాయి కానీ రాజేశ్వరి చెప్పలేదు. కాస్సేపు ఆగి అంది. 'మీరు తృప్తిగా ఫలహారం చేశారా'

'ఏమిటో ఏం తృప్తో సస్పెన్సుతో ప్రాణం చచ్చిపోయింది.'

'ఇంక చెప్పేస్తున్నాను లెండి.'

'వొద్దు రాజేశ్వరీ నా వుత్సాహం చప్ప బడిపోయింది.'

'నిరంజనంగారి ఆఫీసులో టైపిస్టు పోస్టు ఖాళీగావుంటే...' శ్రీనివాస్ యింకా వినలేదు: 'ఒద్దు రాజేశ్వరీ ఆ పాతె గూడులో నువ్వు ఉద్యోగం చేయద్దు. నీకు ఉద్యోగం లేకపోయినా నాకు యిష్టమే కానీ ఆ నిరంజనం ఆఫీసులో...

'అసలు నేను వుద్యోగం చేయడం మీకు యిష్టం వుండదు. ఆమాట చెప్పకూడదా.'

'నిరంజనం సంగతి తెలిసే యెలా యిష్టపడ్డావో అర్థం కావడం లేదు.'

'మనం మంచివాళ్ళం అయితే లోకంతో మనేమిటి? అతను యెంతో మందితో తిరుగుతాడని నన్నా వాళ్ళల్లో జమ కట్టేయకండి.'

'నువ్వు యేదో ఆశలో కొట్టుకు పోతున్నావు. నేను యేం చెప్పినా నీకు అలాగే అనిపిస్తుంది. పోనీ నీ యిష్టం అలాగే కానివ్వు.'

రాజేశ్వరి మాట్లాడలేదు.

రాత్రి భోజనాలయాక ఆరుబయట మంచాలు వేసుకుని శ్రీనివాస్ మాత్రం అటు తిరిగి పడుకున్నాడు. పుచ్చపువ్వు లాంటి వెన్నెల ప్రకృతిలో పిండారబోస్తోంది. మూసీనదికి కొద్దిగా వరదలు తగిలాయి. సన్నటిగాలి ఈ చెవిలోంచి ఆ చెవుల్లోకి దూసుకు పోతోంది. కొబ్బరి చెట్ల ఆకులు గలగల లాడుతున్నాయి. అతని మనసు పూర్తిగా అశాంతిని చుట్టేసింది. 'సుఖంగా వున్నాను అనుకునే టైములోనే రామదాసు అర్ధాంతరంగా వూడిపడటం, యేమిటో అప్పుల్లో చిక్కుకోవడం యివన్నిటినీ దాటేయగలను అనుకుంటూంటే రాజేశ్వరి యేమిటో యిలా చేస్తోంది'

తమలపాకులు పళ్ళెంలో వుంచుకుని నెమ్మదిగా అతని పక్కకి వచ్చి కూర్చుని వీపుమీద చేయివేసి అంది 'మీకు కోపం వచ్చిందనుకుంటాను'

'.................'

'నిజంగానే కోపం వచ్చింది. అయితే



# ఉదయమందలి తాజాదనము గంటల కొలది వుండేలా చేసుకోండి....

దానికి కావలసినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కు! ఉదయం స్నానానంతరం పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కును ఒళ్లంతా జల్లుకొంటే తాజాదనము, హాయిని గంటల కొలది వుంచుతుంది. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కు యొక్క తేలికైన పరిమళము ఒంటి మీద రోజంతా నిలిచి వుంటుంది. చెమటను త్వరగా పీల్చే గుణము గల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కు మండే ఎండలలో, ఉక్కబోసే వాతావరణములో మిమ్మల్ని సేద దేర్చి, తాజాగా, హాయిగా, పరిమళంతో వుంచుతుంది. సంవత్సరమంతా అన్ని వాతావరణములలోను మీరు వాడదగినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కు!




## పాండ్స్

డ్రీమ్‌ఫ్లవర్ టాల్కు —

**ఎంతో మెత్తటి మేలు రకం టాల్కు!**

రిజిస్ట్రా. పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపింపబడినది)

# మొగలి పొదలు

మీకూ కోపం వస్తుందన్నమాట' రాజేశ్వరి నెమ్మదిగా అతన్ని మెట్టేసి చీకటి వైపు వున్న శ్రీనివాస్ మొహాన్ని రెండు చేతులతో తనవైపు తిప్పుకుంటూ అతని పెదాల మీద ముద్దుపెట్టుకుని 'నేను కొంచెం వుద్రేకంగా యేదో అని వుంటాను. నాకు నచ్చకపోతే ఆరోజే మానేస్తాను. మీరు మాట్లాడకుండా కూర్చుంటే నాకు యెంత బెంగగా వున్నదని' అంది.

శ్రీనివాస్ అన్నాడు! 'యెందుకు బెంగ? నిన్ను నేను యేమీ అనలేదు రాజేశ్వరీ, నాకు కోపం దేనికి మధ్య, నీ సుఖం నీ ఆనందం కన్నా నాకు కావలసింది యే ముంటుంది?'

'యేమో మీకు మాత్రం కోపం వచ్చింది'

'లేదోయ్'

శ్రీనివాస్ కోపం క్షణంలో విగిరి పోయింది.

రెండు మూడురోజాలు అయేసరికి రాజేశ్వరి వుద్యోగంలో సుఖం గ్రహించింది. యింటి పట్టున వుండి వేళకు వండి భర్త కోసం యెదురు చూస్తూ వుండడంలోవున్న అందం బయటికి వెడితే రాదని గ్రహించింది. భర్త ముందు తను నిజం చెప్పకుంటే తేలికైపోతానేమో అని శ్రీనివాస్ అడిగే ప్రశ్నలకి నవ్వుతూ సమాధానం యిచ్చి ఆఫీసులో క్లర్కుల గురించి తెగ చెప్పకుపోయేది. చిన్న కంపెనీలో నిరంజనం షేర్‌హోల్డర్. రాణీగంజ్‌లో కొంచెం దూరంలో ఒక గది తీసుకుని అందులోనే పెట్టారు. ఏనిమిది మంది వాటాదార్లు. రోజులో నాలుగైదుసార్లు వరుసక్రమంగా యిద్దరుచొప్పున అరగంటకోసారి రావడం పనివాళ్లనీ, గుమాస్తాలనీ, రిప్రజెంటేటివ్‌లనీ గజగజ లాడించేసి బర్‌మనే కారు హోరులో అంతర్ధానం కావడం ఇలా జరుగుతుంటే రాజేశ్వరి నవ్వుకుంటూంటుంది. రాజేశ్వరి కోసం అతను యిల్లు కూడా మార్చాడు సికింద్రాబాదు వైపు.

'మీవారు యీ కంపెనీలో చేసిందుకు ఎలా ఒప్పుకున్నారు?' రామారావు అడిగాడు.

'ఆయన ఒప్పుకోక పోయిందుకేం వుంది యిందులో'

'మీరు విలియంగారిని చూశారా?'

'ఊఁ'

'అతను'

'ష్' వీకెందుకు రామారావ్. పెద్దవాళ్ల విషయాలు,' నాగరాజు కన్ను మసగానే తగ్గిపోయాడు రామారావు.

కుతూహలంగా అడిగింది రాజేశ్వరి 'ఏమిటండీ అది?'

'యేమీలేదు', నాగరాజు నవ్వాడు.

'అయితే యేదో వున్నదన్న మాట,' రాజేశ్వరి వాక్యం పూర్తి కాలేదు. ఆకుపచ్చని విమానం లాంటి కారు రోడ్డు మీద రెక్కలు చాపుకుని ఆగింది. యెవరి స్థలాల్లో వాళ్లు నిశ్శబ్దంగా కూర్చుండిపోయారు.

'మీకు నెలనెలా ఠంచనుగా జీతాలు యివ్వడం లేదనీ, మీ మీద పనిలో మాకు నమ్మకం లేదనీ నలుగురూ కలిసి గూడుపుఠాణీలాంటివి చేయడం నాకు నచ్చదు. మన సంస్థ బాగుపడాలంటే అందరం వొకటిగా మెలిగి వొళ్లు వొంచి పని చేయాలి. ఏనిమిది గంటల వరకూ కంపెనీలోనే వుండాలి. పొద్దున్నే ఏనిమిదిన్నరకి తలుపులు తెరవాలి. వింటున్నారా,' శాస్త్రి గొంతు ఖంగుమంది.

భాగస్వాముల్లో విలియం, శాస్త్రి, నిరంజనం, భీమశంకరం యెక్కువగా వస్తూంటారు. అందరిలో నలుగురి కష్టసుఖాలూ కొంచెం ఆకళించుకుని, అవసరంలో ఆదుకోవడం గానీ, మంచి సలహాలు యివ్వడంలో గానీ శాస్త్రిదే పైచేయి. అతను మాట్లాడడు. వుపన్యాసంలా దంచేస్తాడు గంటల తరబడి. అతని వాగ్ధోరణిలో చేయవలసిన పనులు వెలలకి వాయిదాలు పడినా అందులో ఆశ్చర్యపడనవసరం లేదు.

'చూడండి రాజేశ్వరిగారూ మీరు పది గంటంకి వస్తూ ఐదు గంటలకి వెళ్లుతూంటారని చాలాసార్లు విన్నాను. నిరంజనం రికమెండు చేశాడని యేమీ అనలేకపోతున్నాను. కంపెనీ రూల్స్ కొంచెం గ్రహించాలి'.

'నేను చాలా దూరంనుంచి వస్తున్నాను సార్. బస్సులు యిన్‌టైమ్‌లో దొరకవు.'

'తొందరగా లేచి రావాలండీ.'

'త్వరగానే వస్తున్నాను: కాని రిక్షా వల్ల...'

'దానికి మేము బాధ్యులం కాము. మీరు సాయంత్రం ఐదుగంటలకే వెళ్ళిపోతే మీకు యిచ్చే జీతం మాకు దండుగ క్రిందే వస్తుంది.'

'నేను స్పైవు చేస్తూనే వున్నాను సార్.'

'యేం చేయడమో. కార్బన్ పేపర్లు మొత్తం రెండు నెలలు రాలేదు. దస్త్రా కాగితాలు సగంపైన చెత్తకుండీలోనే వుంటున్నాయి. మీరు పదినుంచి అయిదుగంటల వరకూ చేసే పనిలో నాలుగు లెటర్స్ వుండడం లేదు. మీరు వెళ్ళాక నిరంజనం, విలియం లాగానే మరీ యెక్కువయ్యే ఆ టైపింగ్ వర్కంతా నేను చేస్తున్నాను.'

'నేను నిరంజనంగారితో అలాగనే చెప్పి చేరాను సార్'

'మీకు నెలకు డెబ్బైఅయిదు యిస్తున్నాం. కావాలంటే జీతం పెంచుతాం. మీరిలా కంపెనీ టైముకు సరిగ్గా రాకపోతే మీవల్ల మాకు లాభం వుండదు. నేను నిరంజనంతో కన్సల్టు చేస్తే లాభం వున్న మనుషులైతే...

'మీకంత కష్టంగావుంటే నేను రిజైన్ చేస్తాను. మాటలనవసరం' రాజేశ్వరి కటువుగానే అంది.

రామారావునీ, నాగరాజునీ, యిలా పేరు పేరునా శాస్త్రి న్యాయంగానో, అన్యాయంగానో పెట్టవలసిన చివాట్లు పెట్టేసి స్కూటర్‌మీద క్షణంలో వెళ్ళిపోయాడు, కారు విలియం కోసం వుంచి. రాజేశ్వరి మొహం యెరుపు రంగుకి మారిపోయింది. యిన్నాళ్ళ నుంచీ కాపురం చేస్తూంటే శ్రీనివాస్ ఒక్కమాట అనలేదు. యివాళ శాస్త్రి యెన్నిమాట లన్నాడు. తన భర్త తమాషాకి కూడా యేమీ అనేవాడు కాదు.

'కంపెనీల్లో అంతేనండి. మీరు చిన్న బుచ్చుకోవలసిందేమీ లేదు' ముగ్గురు క్లర్కులూ యేక కంఠంతో అంటూంటే రాజేశ్వరి మౌనంగా వుండిపోయింది.

వారం రోజులు దాటిపోయినా జీతం యివ్వలేదు. కంపెనీకి పార్సెల్స్ వచ్చిన చెక్కపెట్టెలు గుట్టలుగా పడి వున్నాయి. కొత్తగా వచ్చిన మేనేజరు నిరంకుశత్వంతో ముగ్గురి క్లర్కుల ప్రాణం విసిగి వేసారి పోయింది. బీద కుటుంబాల్లోంచి వచ్చిన ముగ్గురికీ రోజు గడవడమే కష్టంగా వుంది.

'మీరు నమ్మండి రాజేశ్వరి బస్సులకి మిగలడం లేదు. ఒక్కడి రాణీగంజ్ యెక్కడ చార్‌మినార్ యింతదూరం నడిచి వెళ్ళాం. మీరు యీమాట మరెవరిదగ్గరా అనకండి'

'యేమాట?' రాజేశ్వరికి అర్థం కాలేదు.

కంపెనీ పూర్తిగా డబ్బుతో నిండి పోయింది. మేము శుభ్రం చేస్తాం. అది పనివాడితో చేయించాం అని చెబుతాం.



ఆ ఉత్తర్వు మేం తీసుకోవటంలో తప్పేముంది ?' నాగరాజు అన్నాడు.

'మీ యిష్టం'

'కష్టపడుతున్నాం పనికి ప్రతిఫలం యివ్వమని న్యాయంగా అడుగుతే వాళ్ళు యివ్వడం లేదు. మీరు మాతో యేకీభవిస్తే'

'నన్ను యేంచేయ మంటారు ?'

'యిక్కడి విషయాలు మామీద దయుంచి నిరంజనంగారి దగ్గర అనకండి'

'ఛ ! నే నలాంటి దాన్ని కాను'

'యిన్ని చెక్కపెట్టెలు వృధాగా రోడ్డు మీదికి పోతున్నాయి. దారిన పోయేవాళ్ళు అందినన్ని చేతపట్టుకు పోతున్నారు. వున్న వాటిలో కొన్ని అమ్మేయాలని వుంది'

'నిరంజనంగారికి మన మీద అభిప్రాయం పోతుంది'

'తలుపులు మూసేందుకు అడ్డంగా వున్నాయని ఆయనే బయటపెట్టమన్నారు. రాత్రి యెవరో కొట్టేశారు కొన్ని. యిప్పుడైనా మనం వాటిలో కొన్ని అమ్మేస్తే యేం'. రామారావు అంటూంటే రాజేశ్వరి విని వూరుకుంది.

శాస్త్రి మాటలు చెవుల్లో రింగుమన్నా రాజేశ్వరి లెఖ్ఖజేయలేదు. ఐదు గంటలకే యింటిదారి పట్టింది. కంపెనీలో జరిగే విషయాలు పూర్తిగా విని నవ్వాడు శ్రీనివాస్. 'నీ యిష్టం నాదేం లేదు నీకు పనిచెయ్యాలని వుంటే చేయి...

'మరోవారం చూసి తేల్చుకుంటాను', రాజేశ్వరికి గాలీ పోలుబోలేదు. అసలు ఆ వుద్యోగం పూర్తిగా అసంతృప్తిగా అనిపించింది ఆవిడ ప్రాణానికి.

* * *

నిరంజనం కళ్ళు చిట్లించి రాజేశ్వరికి గుమ్మారంలో నిలుచుని అన్నాడు : 'నీ కనా మంచివాళ్ళు ఎంప్లాయ్ మెంట్‌నుంచి వచ్చారు కానీ యేదో ఆర్థిక చిక్కుల్లో వున్నావని నీకు యిప్పించాను యీ వుద్యోగం'

రాజేశ్వరి బుర్ర వంచుకుంది.

నిరంజనం వెళ్ళిపోయాక రాఘవరావు అన్నాడు : 'మీరు యీ కంపెనీలో పని చేయద్దు. మీవల్ల మాకు నష్టం యేమీ లేదు. అనుకూరా అంత మంచిదికాదు. నేను చెప్పేది వినండి.'

'రాజేశ్వరి మౌనంగానే వింది.

# మొగలి పొదలు

ఈ కంపెనీలో పనిచేయాలనుకునే వాళ్ళు అధికారుల ఆర్ధవంతో వుండాలి. మీరలా వుండలేరు. కాదంటారా'

'అవును నేను బానిసగా వుండలేను'

'ఏం చేయాలనుకుంటున్నారు'

రాజేశ్వరి వ్రేళ్ళు టైపు మిషన్ మీద టక టక శబ్దం చేస్తున్నాయి.

'నేనుకూడా వెళ్ళిపోవాలనుకుంటున్నాను. యిక్కడ నాకేమీ తృప్తిగా లేదు' రామారావు అన్నాడు.

రాజేశ్వరి కాగితాన్ని తీసి రాఘవరావు కిచ్చింది: 'మీతో యిన్నాళ్ళు పనిచేశాను. అనుభవంగా యీ వుద్యోగం జీవితం అంతా గుర్తువుంటుంది మరి వస్తాను'

ముగ్గురు క్లార్కులూ సాగనంపారు.

శనివారం మధ్యాహ్నం పొంటిగంటకి వచ్చిన శ్రీనివాస్ రాజేశ్వరిని చూసి ఆశ్చర్యపోయాడు. శ్రీనివాస్‌ని చుట్టేసి బావురుమంది : 'నేనింక పనిచేయను', అంటూ శ్రీనివాస్ ఆవిడ తలమీద చేయివేసి 'నిన్నిప్పుడు యెవరు చేయమన్నారోయ్. మనం హాయిగావుంటే అంతే చాలు. అతనిమాటల మధ్యలోనే నెలలు నలిగిపోయాయి. రాజేశ్వరి వుద్యోగం పోయాక సంసారం మొదటికే వచ్చింది మళ్ళీ.

పేకాట వేస్తూ అంది : 'మీరు నమ్మతారా,' అని.

'యేమిటి ?'

'నేను యిక్కడికి మొదట్లో వచ్చే ముందు దేవదాసు దగ్గరికి వెళ్ళాను'

'యే దేవదాసు ?' శ్రీనివాస్‌కి అర్థం కాలేదు.

'హార్మోనిస్టు.' అన్నయ్య కోసం వచ్చే వాడూ...



'వాడిదగ్గరకా', నమ్మలేనట్టుగానేవుంది అతని స్వరం. ప్రళాకరం యిచ్చేసార్నా అంటూంటే విన్నాడు. దేవదాసు మరో మనిషి కలిసి అర్ధరాత్రి యెవరో ఆడపిల్ల గొంతు కోశారని.

'యిప్పుడు రాజమండ్రీ జాంపేటలో పెద్ద మేడ కూడా వుంది అతనికి'

'వాడికా', శ్రీనివాస్‌కి దేవదాసుతో పరిచయం బాగానే వుంది.

'అవును దానవాయిపేటలో వుండే ఆ కొంపకీ, యీ మేడకీ ఎంత తేడా వుందో చూశారా...'

'అదృష్టం కలిసి రావాలి రాజేశ్వరీ అతని భార్య...'

'అయ్యో రామ పెళ్ళికాలేదండీ. సినిమాలో ప్లేబాక్‌యిచ్చి ఆరేళ్ళల్లోనే మేడ కొన్నాడు'

'అవును అతను బాగా పాడేవాడు. అవధానిగారు నాతో అంటూండేవారు. అతనిగొంతులో సంగతులు పలకవుగానీ మనుషుల్ని ముగ్ధుల్నిచేసే స్వరం అని'

'అవును నేనూ విన్నాను మీ గురించి దేవదాసు అంటూంటే'

'యేమని'

'కష్టపడి మూడోకంటి వాళ్ళకైనా తెలియకుండా శాస్త్రీయ సంగీతాన్ని నేర్చుకున్నారని'

శ్రీనివాస్ పెదవులమీద చిరునవ్వు మెదిలింది కాస్సేపు. 'అమ్మకి సంగీతం అంటే యిష్టం. అందుకే నేర్చుకోగలిగాను'

'నాతో చెప్పారు కారు'

'నీకు తెలిసే వుంటుందని చెప్పలేదు'

'అన్నట్లు దేవదాసు దగ్గరికి యెందుకు వెళ్ళావో మీరు అడిగారు కాదు'

'నువ్వు చెబుతూనే వున్నావు కదోయ్.'

'బాబాయి ఆ రాత్రి కేకలు వేయగానే అన్నయ్యకి మీ లాంటి స్నేహితుడే అని వెళ్ళాను. తనని పెళ్ళి చేసుకుని వుండిపొమ్మన్నాడు.'

'నువ్వు యేమన్నావు ?'

'అనేందుకు యేం వుంది ? కొంచెం డబ్బు సర్దమని అడిగాను. యిచ్చాడు. దానిలోనే వచ్చాను యిక్కడికి.'

'..............'

'నా మొదటి జీతంలో ముప్పై ఎవరికి చెప్పకుండా పంపించాను. క్షమిస్తారా నన్ను.'

'యిప్పుడు అడుగుతున్నావా' శ్రీనివాస్‌కి కోపం వచ్చింది.

'ఎందుకంత లోపే కోపం తెచ్చుకుంటారు ?'

'చూడు రాజేశ్వరీ నీకు న్యాయంగా, ధర్మంగా అనిపించి వుండవచ్చును. నేను భర్తని నీకు. నా చాటుగా నువ్వు అటువంటి పనులు చేస్తూంటే నీకు తెలియదు నా మనసు యెంత నిగ్రహించుకున్నా కుతకుత లాడుతోంది.'

'నే నిప్పుడు కాని పనేం చేశాను.'

'నువ్వు దేవదాసుకి డబ్బు పంపేముందు ఆ మాట నాతో అని వుంటే యెంత ఆనందించేవాడిని ?' అతని చేతిలో పేక ముక్కలు చెల్లాచెదరై పోయాయి. నేల మీద అర్థం లేనట్టుగా పరుచుకుని పగిలి పోయిన జీవితంలా కనిపిస్తున్నాయి. శ్రీనివాస్ మరి మాట్లాడలేదు అతని అంతరంగం వుడికిపోతోంది. యెంత సరిపెట్టుకుందాం అనుకున్నా పద్మావతి కళ్ల ముందు కదులుతోంది. భర్తపోయాక యిద్దరు పిల్లలున్న పద్మావతి కక్కుర్తి పడితే రాజేశ్వరి అలా చేయదని నమ్మకం యేమిటి ?' అతని మనసు యీ శంకతోనే కొట్టుకులాడి పోతోంది. స్త్రీని యెంత వరకూ నమ్మాలో కూడా అవగాహన కాలేదు అతని గుండెల్లో మంటలు బయలుదేరుతున్నాయి. వాటిని మనసు రెచ్చగొడుతూ వుధృతంగా ఆకాశానికి యెత్తుతోంది. రాజేశ్వరి అతని కాళ్లమీద చేయివేసి కూర్చోగానే అతని వేదనంతా పటాపంచలై పోయింది. పాదివి పొట్టుకుని ఆవిడని దగ్గరకు తీసుకోగానే అతని మనసు పాలరాయిలా స్వచ్ఛంగా మారిపోయింది. అనుమానంలాంటి పిశాచాన్ని నైర్మల్యం కొట్టేసింది అతను నెమ్మదిగా అన్నాడు. 'చూడు రాజేశ్వరీ. యింకెప్పుడూ నాకు దూరంగా రహస్యాలు వుంచుకుని నన్ను నీ శరీరభాగంలోంచి విడగొట్టకు', అలా అంటూంటే వెచ్చని కంటినీటి చుక్క జారి ఆవిడ నుదుటమీద పడింది.

'నేను...నేను యింక యెప్పుడు చేయను. దైవసాక్షి' రాజేశ్వరి అంది

(ఇంకా ఉంది)




గొరిల్లా ఒక తోకలేని కోతి — వాలిడి అంటారు. ఇది ఆఫ్రికాలో కాంగో ప్రాంతాల్లో ఉంటుంది అడవుల్లో ఉండేవాటికీ, కొండలమీద ఉండేవాటికి కొద్దిగా తేడాలుంటాయి.

చూడ్డానికి చాలా భయంకరంగా ఉండే ఈ గొరిల్లా 5–6 అడుగుల ఎత్తుతో 5–6 వందల పౌన్ల వరకు తూగుతుంది. కొంత మానవాకారం దీని లక్షణాల్లో గోచరిస్తుంది అసలు దీనిపేరుకు అర్థమే అడవి మనిషి. గొరిల్లా చెవులు చిన్నవి. కళ్లపైన దట్టమైన గోడఉంటుంది. దాని కోరపన్ను చాలా పెద్దది. దాన్ని చూడగానే, శత్రువులకి వణుకు పట్టుకొంటుంది. ఇక అటువంటిదానికి తెలివితో పనిలేదేమో !

ఇంత భయంకరమైనదైనా, సాధారణంగా మనిషికి ఏమీ ప్రమాదం తీసికొనిరాదు అనవచ్చు. అయితే ఏ పరిస్థితికైనా సిద్ధంగా ఉంటుంది. అవసరంవస్తే ఎలాటి శత్రువునైనా ఎదుర్కొంటుంది.

కోపం వచ్చినప్పుడు నోరు తెరిచి, భయంకరమైన దంతాలు చూపించి, చేతులతో గుండె దబ, దబ బాదుకొంటుంది. అయితే ఇతర సమయాల్లో, ఆనందం, ఉత్సాహం అధికమైనప్పుడు కూడా ఇలాగే కొట్టుకొంటుంది. కుక్క మొరుగులాటి శబ్దంకూడా చేస్తుంది ఇంతకూ దీని ఆహారం ముఖ్యంగా ఆకులూ, అలములే అయితే ఒక్కొక్కప్పుడు పక్షుల గుడ్లు, పక్షులనుకూడా తింటాయి— ముఖ్యంగా పిల్ల గొరిల్లాలు. అంత శరీరానికి ఎంత ఆహారం కావాలి ? చెట్లకు చెట్లు, తోటలకు తోటలు ధ్వంసం చేస్తాయి.

సాధారణంగా 30–40 గొరిల్లాలు ఒక కుటుంబానికి చెందినవి తిరుగుతాయి. సాయంకాలం అన్నీ ఒక చెట్టుఎక్కి ప్రతిదీ ఒక గూడులేక పడక వేరుగా ఏర్పాటు చేసుకొంటాయి. తండ్రి గొరిల్లా—నాయక గొరిల్లా— చెట్టుక్రిందనే కాపలా కాస్తూ ఉంటుంది. బహుశా దాని బరువుకూడా ఎక్కడానికి, పైన పడుకోడానికి అనుకూలంగా ఉండదు.

ఎంతైనా ఇది చతుష్పాదే ! నడిచేప్పుడు రెండు చేతులను నేలకు ఆన్చుతుంది

—జమ్మి కోనేటిరావు



# కుక్క గొడుగులు

ఎ.యస్.వి.ప్రసాద్

రాత్రి పది గంటలు కొట్టింది గడియారం టిక్కు టిక్కు మంటోంది నిశ్శబ్దాన్ని చీల్చుతూ

సుగుణ పట్టెమంచం మీద పొర్లుతోంది అటు యిటూ. ఎంత ప్రయత్నించినా నిద్ర రావటం లేదు. కిటికీ తలుపులు తీసింది చల్లటిగాలి లోపలికి వీచి గిలిగింతలు పెట్టింది

ఎదురింటి డాబామీద రెండు మానవాకారాలు అస్పష్టంగా కనబడుతున్నాయి 'పూర్ణ ఎంత అదృష్టవంతురాలు ? తన ఈడుదే! పెళ్లిచేసుకొని భర్తతో ఎంత అన్యోన్యంగా వుందో! తానంటె ప్రాణం పెడుతుంది. కానీ. రాజారావు? తనను బొత్తిగా అలా తీసేసేటట్లు చూస్తాడేమిటి ?'

అప్రయత్నంగా సుగుణ శరీరం గగుర్పొడిచింది మునివేళ్లు బుగ్గల మీదకు పాకాయి సుగుణ వుత్సాహం నీళ్లు జల్లినట్లు చప్పబడి పోయింది చేతివేళ్లతో మొఖంపై గంట్లను తడుముకుంది అప్రయత్నంగా సుగుణ కళ్లు చమర్చాయి. కన్నీటిబొట్లు టపటపమని బుగ్గలపై రాలాయి.

చీర కొంగుతో కళ్లు తుడుచుకొని హాలువైపు చూసింది. లైటు మసగ్గా వెలుగుతోంది. ముఖముపై చెంగు వేసుకొని ప్రశాంతంగా నిద్రపోతోంది వదిన. ఈజీచైరులో నడుం వాల్చింది అమ్మ

'టక్ టక్'మని బయట తలుపు చప్పుడు వినబడింది అన్నయ్య వచ్చినట్లున్నాడు తలుపు తీద్దామని లేవబోయిన సుగుణ భారంగా మంచంమీద కూలబడిపోయింది. తలుపు తియ్యగానే 'ఏం సుగుణా యింకా నిద్రపోలేదా ?'—యిదే అన్నయ్య అడిగే మొదటి ప్రశ్న తననీ లోకంలో పూర్తిగా అర్థం చేసుకోగలిగే 'దెవరైనా వుంటే అది అన్నయ్య ఒక్కడుమాత్రమే. వాత్సల్యంతో తొణికిసలాడే అన్నయ్య కళ్లను తాను మభ్యపెట్టలేదు తాను బాధపడు తున్నానని తెలుస్తే మరీ కృంగిపోతాడు పిచ్చి అన్నయ్య!

గడియ తీసిన చప్పుడు తరువాత 'ఏరా యింత ఆలస్యమయింది?' అంటున్న అమ్మ గొంతుక వినబడుతోంది. అన్నయ్య ఏం చెప్తాడోయని ఆతృతతో వినసాగింది సుగుణ 'బస్సు లేటయిందిలే గాని సుగుణ పడుకుందా ?' అన్నయ్య ప్రశ్న.

సుగుణ గుండెలు 'గతుక్కు'మన్నాయి. బలవంతంగా కళ్లు మూసుకొని నిద్రపోతున్నట్లు పడుకుంది. మరుక్షణంలో గదిలో లైటు వెలిగింది పాదాల సవ్వడినిబట్టి వచ్చింది అన్నయ్యని తెలుసుకొంది. నిద్రపోతున్న తనను చూసి సంతృప్తిగా వెళ్లిపోయాడు అన్నయ్య, వెనకే వదిన లైటార్పి వెళ్లిన చప్పుడు వినబడింది నెమ్మదిగా కళ్లు తెరచింది సుగుణ అంతా చీకటిగా వుంది 'నేనంటే ఎంత ప్రేమో అన్నయ్యకి! తనలో తాను గొణుక్కుంది'

'ఇంతకి నువ్వెళ్లిన పని ఏమయిందిరా' అంటోంది అమ్మ భోజనాల గదిలోంచి యే సంభాషణ అయితే వినకూడదనుకుంటోందో అదే బలవంతంగా సుగుణచెవుల్లో పడుతోంది

'అవ్వడానికేముంది లే'— ఆగాడు అన్నయ్య హు! 'వీళ్లకు కూడా పిల్ల నచ్చలేదన్న మాట' అంటోంది అమ్మ

సుగుణ తలమీద సుత్తులతో మోదినట్లు వినబడుతున్నాయా మాటలు.

అవును యింతక్రితం ఎంతోమంది అన్నమాటే వీళ్లు అన్నారు యిందులో బాధపడడానికేముంది ? తన పిచ్చిగాని తనకు

బాగో లేదనక బాగుందంటారా ఎవరైనా? దుఃఖం పెల్లుబికింది. చేతుల్లో మొహాన్ని దాచుకుంది.

'దీనికి పెళ్ళిచేయడం బ్రహ్మతరంకాదు' ఆ పాడు మసూచికం దీని గొంతుకిలా కోసే కన్న ఆనాడే తీసుకొనిపోయినా బాగుండి పోను'— అమ్మ గొంతు జీరబోయింది.

'అవును, తన నెవరు పెళ్ళి చేసుకొంటారు. తనకు సుఖంలేదు సరికదా తనగురించి తన వాళ్ళకుకూడా ఎంత కష్టం వచ్చింది? లోపల ఏమిమాట్లాడు కొంటున్నారో వినేస్థితిలో లేదు' తాను విన్న అమ్మ మాటలే చెవుల్లో మార్మోగు తున్నాయి. ఎంత కష్టం కలుగకపోతే నవ మాసాలు కని, పెంచి, పెద్దచేసిన అమ్మ అటువంటి మాట అంటుంది?

భారంగా నుదురు పట్టుకొంది సుగుణ. ఆలోచనలు పదేళ్ళు వెనక్కు తిరిగాయి.

ఆ రోజు స్కూలునుంచి వస్తూనే పుస్తకాలుసంచి గూట్లో పడవేసి హాలులోకి పరిగెత్తింది సుగుణ. ఫానుకింద కూర్చొని అమ్మ, నాన్నగారు, అన్నయ్య మాట్లాడు కొంటున్నారు. నాన్నగారి చేతిలో ఏదో కవరుంది. 'రఘు బావరమ్మంటున్నాడు. బెంగుళూరు వెడతావేమిటే సుగుణా' అన్నారు నాన్నగారు. 'పోండి నాన్నా!' అంటూ నూతివైపు పరిగెత్తింది వెనకనుంచి అమ్మా నాన్నల నవ్వు వినబడుతోంది. 'ఎవరు రాశారమ్మా వుత్తరం' అని భోజనం చేస్తూ అడిగింది. 'మీ మామయ్యే! వేసంగులకు మనం దర్నీ బెంగుళూరు రమ్మని వ్రాశాడు' అంది అమ్మ. అంటె, రఘుబావ యింటికన్న మాట. 'మరైతే వెడదామా మనం?' అంది తను. 'ఆ సంగతి తరువాత మాద్దాంలే గాని భోజనంచేసి బయటకి నడు ముందు'— కసిరింది అమ్మ. కోర్టుకు శలవు లియ్యగానే తాను అమ్మ వస్తామని చెప్పి ముందు తనను, అన్నయ్యను చెల్లి శ్యామలను బెంగుళూరు పంపించారు. బెంగుళూరులో రైలు ఆగగానే రఘు, వాళ్ళ కారు డ్రైవరు వెదుక్కుంటూ వచ్చారు. అందరూ కారువైపు నడవసాగారు, ఎవరూ చూడకుండా బావ తనను వెక్కిరించాడు. అదేపని తాను చేసింది చిలిపిగా. అత్తయ్య, మామయ్య తనను చూసి కోడలు కోడలని మురిసిపోయారు. సాయంత్రం కాగానే బావ వాళ్ళకారులో తోటకి బయలుదేరారు. ఆ రోజంతా సరదాగా గడిచిపోయింది. ఇంటికి చూడడానికి వచ్చిన వారందరితోను మా కోడలని చెప్తూవుంటె చచ్చినంత సిగ్గుగా వుండేది. పదిహేనురోజులు యిట్టే తిరిగాయి. తరువాత అమ్మ నాన్నగారు బెంగుళూరు వచ్చారు. ఇంట్లో పెద్ద పండగలా వుంది. కాని తనవంట్లో ఏమీ బాగోలేదు. ఆ మర్నాడే తీవ్రంగా జ్వరం వచ్చింది. అంతా కంగారు పడ్డారు. రఘు బావ దిగులుగా అక్కడే కూర్చుండి పోయాడు. మరి రెండు రోజులు గడిచాయి. డాక్టరు యిది మశూచి సంబంధమైన జ్వరమని తేల్చాడు. 'సుగుణ గదిలోకి వెళ్ళ వద్దని ఎన్నిమాట్లు చెప్పాలిరా' మందలించింది అత్తయ్య, రఘుని. ఆ రోజు నుంచి రఘు మట్టుపెట్లు ఎక్కడా కనిపించలేదు. మరొక నెల గడిచింది. మశూచికం తగ్గింది కాని తన ముఖాన్ని వికృతంగా గుంటలుచేసి మరీ పోయింది. 'ఏమయితే లెండి, మనపిల్ల మనకు దక్కింది అదే మనకు పదివేలం'ది అమ్మ చూడడానికి వచ్చిన ఎవరితోనో.

ఆ నాడు అమ్మ అన్నమాటలు చెవుల్లో రింగు రింగు మంటున్నాయి. అదే అమ్మ ఈనాడేమంటోంది! భారంగా కళ్ళు మూసుకుంది సుగుణ. సన్నని వర్షపు నీటి తుంపరలు మీదపడి గతంలోంచి ప్రస్తుతంలోకి తీసుకొని వచ్చాయి. కిటికీ తలుపులు మూసి నిర్లిప్తంగా చీకటిలోకి చూడసాగింది.

హాలులోంచి అన్నయ్యమాటలు వినబడ సాగాయి. 'పిల్లయితే నచ్చలేదన్నారే గాని వాళ్ళు మనతో వియ్యమందటానికి సిద్ధంగానే వున్నారు. శ్యామల వాళ్ళకు నచ్చిందిట, కట్నం లేకుండా చేసుకుంటామన్నారు'— అన్నయ్య యింకా ఏదో చెప్తున్నాడు.

'తన చెల్లెల్ని చేసుకుంటామన్నారా! వాళ్ళెం ఖర్మ తన రఘుబావే ఆ మాట అన్నప్పుడు?' రఘుపేరు తలుచుకోగానే మనస్సు చివుక్కుమంది. తన ఆశలన్నీ నిల్పుకొన్న బావకు తాను నచ్చలేదుట. యింతేనన్నమాట! బావ తనని అర్థం చేసుకొన్నది? తన తండ్రి, కోర్టు వ్యవహారంమీద పొరుగూరు వెళ్తూ టాక్సీ ప్రమాదంతో మరణించిన నాటి నుంచి మామయ్యగారింటితో సంబంధం నానాటికి క్షీణించింది. ప్రతి సంవత్సరం శలవలకు తన యింటికి వచ్చే బావ మానుకున్నాడు. అన్నయ్య తన పెళ్ళిగురించి వేరే సంబంధాలు చూస్తున్నాడని తెలిసి ప్రాన్పడి పోయింది.

'రఘుబావ నన్ను తిరస్కరించాడా' అని ధైర్యంచేసి అన్నయ్యని అడగలేక పోయింది. సిగ్గువిడిచి విషయం బావకు రాసింది. రెండు పర్యాయాలు సమాధానం కొరకు ఎదురుచూసిన సుగుణకు నిరుత్సాహమే ఎదురయింది.

అన్నయ్య అందించిన బావరాసిన చివరి వుత్తరం చదివేవరకు బావ మారిపోయాడని గ్రహించలేక పోయింది. ఆ వుత్తరం తన హృదయాన్ని చిన్నాభిన్నం చేసింది. ఎన్ని వందలసార్లు చదువుకొందో ఆ వుత్తరాన్ని తెలియదు. మెల్లగా పరుపు తొలగించి వుత్తరాన్ని మరల చదివింది సుపతి వెలుగులో.

'ప్రియమైన బావకు,

నీవు వ్రాసిన వుత్తరం అందినది. సుగుణ వివాహంగురించి నా అభిప్రాయం తెలపమని వ్రాశావు. చాలా కాలంనుంచి నన్ను వేధిస్తున్న ఈ సమస్యకు పరిపూర్ణంగా ఆలోచించి సమాధానం వ్రాస్తున్నాను నీ మనస్సు నిది గాయపరుస్తే క్షమించు.

ప్రతి వ్యక్తికి కొన్ని ఆశలు, ఆశయాలు వుంటాయి. నిజానికవి లేకపోతే మానవుడు బతకనే లేడేమో! నాకు కాబోయే వధువుని గురించి నే నూహించు కొన్న వూహా సౌధంతో సుగుణను చూసుకుంటే కుప్పగా కూలిపోతున్నాయని నా నిర్ణయం విని సుగుణ ఎంతో బాధపడవచ్చు. కాని ఒకళ్ళ సుఖసంతోషాల కోసం నా ఆశలు, సుఖము త్యాగం చెయ్యలేను. అది నా స్వార్థం కావచ్చు, లేదా నా ఔదార్య హీనత కావచ్చు. ఇక పోతే, శ్యామల నా కన్నివిధాల తగిన భార్యగా కనబడుతోంది. నీవేమంటావో రాయి సుగుణను నన్ను క్షమించి నామీద ఆశలు పెట్టుకుంటే — మరచిపొమ్మను.

ఇట్లు,
నీ రఘు.

వుత్తరం మడిచి కవరులో పెట్టింది.

# కుక్క గొడుగులు

ఇంకా హాలులోంచి శబ్దాలు వినబడుతున్నాయి: వెక్కివెక్కి ఏడుస్తున్న అమ్మ గొంతుక వినబడింది. అన్నయ్య సముదాయించి ఏదో చెప్పబోతున్నాడు. 'ఈ సంబంధం కాకపోతే మన సుగుణకు కో అంటే కోటి సంబంధాలు వస్తాయి. నువ్వు వూరుకో' అంటున్న అన్నయ్య గొంతు జీరబోయింది.

'కో. అంటే కోటి సంబంధాలు వస్తాయట!? అమ్మను మధ్య పెట్టి తనను తాను మభ్య పెట్టుకుంటున్నాడు పిచ్చి అన్నయ్య' తనలో తాను గొణుక్కుంది.

* * *

ఉదయం తొమ్మిది గంటలయింది.

'అక్కా, అక్కా' అంటు దాదాపు పరిగెడుతూ వచ్చింది శ్యామల. కుర్చీలో కూర్చుని పత్రిక చదువుకొంటున్న సుగుణ ఉలిక్కిపడి పైకి చూసింది. శ్యామల! నల్ల జాకెట్టు పైన నల్లని చీర వేసుకొంది: తెల్లగా కోలగా వుండే శ్యామల నవ్వితే బుగ్గల మీద చిన్న సొట్టలు పడి అందాన్ని ఇనుమడింప జేస్తుంది. తీర్చి దిద్దిన కళ్ళు ఎదుటి వారిని చదువుతున్నామా, అన్నట్లు వుంటాయి.

తేరుకొని 'ఏమిటే అంత సంతోషంగా వున్నావ్?' ప్రశ్నించింది సుగుణ.

'మా ఫ్రెండ్సు అందరం పిక్నిక్‌కి వెళ్తున్నాము; నువ్వు కూడా రావాలి తప్పకుండా' అంది కుర్చీకోడు మీద కూర్చుంటూ శ్యామల.

'నాకింట్లో పని వుందిగాని నువ్వెళ్ళు తయారవు. నీ ఫ్రెండ్సు వచ్చే టయిమయింది' తప్పించుకో బోయింది సుగుణ.

'ఉహు! నా ఫ్రెండ్సుతో ఎక్కడికి రమ్మన్నా ఏదోసాకు చెబుతోనే వుంటావు. ఇవ్వాళ వదిలి పెట్టను నిన్ను' పట్టు బట్టింది శ్యామల.

'అవును, తానెందుకు శ్యామలతో పిక్నిక్‌కి వెళ్ళకూడదు?' తనలో తాను ప్రశ్నించుకొంది.

'ఏమో! సమాధానం లేదు. బహుశా తాను అందంగా వుండనవే భావనే ఈ బలహీనతకి కారణం అనిపించింది. తల యెత్తి శ్యామలవైపు చూసింది. శ్యామల చూపులు తనను చదువుతున్నట్లున్నాయి. మనస్సులోని ఆలోచన శ్యామలకు తెలుస్తే తనకెంత చిన్నతనం.'

'ఏం అక్కా! మాట్లాడవు. నా ఫ్రెండ్సు నిన్నేదయినా అన్నారా!' ప్రశ్నించింది శ్యామల.

'లేదు ... అటువంటిదేమీ లేదు' తడబడింది సుగుణ.

'చూడక్కా! నీకొక విషయం చెబుదామని ఎప్పటినుంచో అనుకుంటున్నాను. నువ్వు దాన్ని తప్పుగా అర్థం చేసుకోనంటే చెప్తా' శ్యామల మొఖం మీద వెనకటి చిలిపితనం బదులు గంభీరముద్ర ఆవహించింది.

'ఛ! అటువంటిదేమి లేదు. చెప్పు శ్యామల' - సాధ్యమైనంతవరకు నవ్వు తెచ్చి పెట్టుకోటానికి ప్రయత్నిస్తూ అంది సుగుణ.

'మనిషి అని పుట్టాక ఏవో లోటు పాట్లు వుండక మానవక్కా. మనం కలలు గనేవన్నీ పొందే భాగ్యం బహుశా యే కొద్ది మందికి మాత్రమో లభిస్తుంది. మనలోని లోపాలను గురించే ఎప్పుడూ ఆలోచిస్తూ, వాటిని ఎదుటివారితో పోల్చి సమన్వయిస్తూ కూర్చుంటే మనకు వొరిగేది ఏమీలేదు సరికదా, ఇంకా నిస్పృహ, నిరుత్సాహం మనకెదురవుతాయి. ఎదుటివారిపై క్రమంగా అసూయ, ఆపైని ద్వేషం ఏర్పడతాయి. ఎవ్వరితోను మనస్ఫూర్తిగా సంచరించటానికి మనస్సు వప్పదు. దీనినే ఇంగ్లీషులో చెప్పాలంటే 'ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు' అంటారు. దీనికి దాసులమయ్యామంటే మన జన్మంతా నరకప్రాయమవుతుంది. కాబట్టి మనలోని లోటుపాట్లను మరచిపోయి హాయిగా తిరిగినప్పుడే మనస్సుకు శాంతి లభిస్తుంది. ఉదాహరణకి సరోజను చూడు. దానికి మెల్లకన్ను. అయితేనేమి అది మా అందరికన్నా హుషారుగా వుంటుంది. జోక్సు వేసి తాను నవ్వి ఎదుటివారిని నవ్విస్తుంది—' ఆగింది శ్యామల —

సుగుణ ఆలోచించ సాగింది. శ్యామల చెప్పినదాంట్లో ఎంతైనా నిజం వుందనిపించింది. తన బలహీనతే తననిలా కృంగదీస్తోంది. ఇది నేటితో ముగిసే సమస్య కాదు. తన జీవితాంతం వుండే సమస్య. కథలలోలాగ ఆత్మహత్య చేసుకోగల ధైర్యం

తనకు లేదు. ఏదో విధంగా తనే సమస్య వెదుక్కోవాలి. కృతనిశ్చయానికి వచ్చిన దానివలె నిట్టూర్చింది.

'ఏం అక్కా! యిప్పుడైనా చెప్పు, పిక్నిక్‌కి వస్తావా రావా?' అడిగింది శ్యామల.

'వస్తాలే' లోపలికి నడిచింది సుగుణ. తనలో ఏదో నూతనోత్సాహం వచ్చినట్లని పించింది. చలాకీగా తిరుగుతున్న కూతుర్ని చూసి ఆశ్చర్యంగా నిట్టూర్చింది పార్వతమ్మ.

'ఎక్కడికైనా వెళ్తున్నావా అమ్మా!' అప్పుడే వస్తున్న అన్నయ్య ప్రశ్నించాడు.

'అవునన్నయ్యా, శ్యామల వాళ్ల ఫ్రెండ్సుతో పిక్నిక్‌కి వెళ్తున్నా' అంది సుగుణ కొత్త ఉత్సాహంతో.

'వెళ్లమ్మా, వెళ్లు' అన్నాడు అన్నయ్య సంతోషంగా.

సుగుణ తన గదిలో బట్టలు మార్చు కొంటోంది. శ్యామల గదిలోంచి అస్పష్టంగా మాటలు వినబడుతున్నాయి

'రేపు ఆదివారంనాడు మా అన్నయ్య పెళ్లి' అంది కమల.

'ఓహో...అయితే మనకు లైన్‌క్లియర్ అన్నమాట' అంది శ్యామల. అందరూ పక పక నవ్వారు.

'పోవే! నీకు మాత్రం...' తరువాత

# కుక్కగొడుగులు

ఏమనలో తెలియక ఆగి పోయింది కమల.

యింతలోనే శారద దీర్ఘంగా నిట్టూర్చి 'యింకా వీళ్లక్కకే పెళ్లి కాలేదు, దీని కేం తొందరే' అంది.

శ్యామల ఏమంటుందోనని ఆతృతగా విన సాగింది సుగుణ.

'సర్లెండిగాని టేబిల్ మీద పేక వుంది మీరు కాలక్షేపం చేస్తూ వుండండి నేని ప్పుడే వస్తానంటూ' సుగుణ గదిలోకి సరా సరి వచ్చింది శ్యామల.

సుగుణ తత్తరపడుతూ 'వేసురడి శ్యామూ' అంది ఎటో చూస్తూ.

'మీ అక్క కూడా వస్తోందేమిటే?' ఆశ్చర్యం ప్రకటించింది అక్కడికి వచ్చిన కమల.

'అవును. అంది' ముక్తసరిగా శ్యామల.

భానువాళ్ల కారులో అందరూ పిక్నిక్‌కి బయలుదేరారు. సుగుణ మిగిలిన వారందరి తోను సంతోషంగా గడిపింది. టిఫిన్లు తినడం అయ్యాక తన మేకప్ బాక్సు తీసింది భాను. 'యిలా యివ్వవే ఒకసారి మహా అందంగా వున్నావులే గాని' లాక్కొ బోయింది కమల.

'ఏమే, నా అందానికేం తక్కువ? నీ కన్న నిన్నలెట్లా బాగుంటా, కావలిస్తే నీవలె నైనా అడుగు' అంది భాను తన ముంగు రులు సవరించుకొంటూ.

మూతి మూడు వంకర్లు తిప్పింది కమల. 'భాను, కమల ఆగండర్రా, నాకిప్పు డొక బ్రహ్మాండమైన ఆయిడియా తట్టింది' అంది శారద.

ఏమిటన్నట్లు చూశా రందరూ. శారద ప్రారంభించింది.

'యిప్పుడు మనం 'బ్యూటీ కాంటెస్టు' ఏర్పాటు చేద్దాం. మన రమ జడ్జిగా వుంటుంది. ఎక్కువ మార్కులు ఎవరికి వస్తే వాళ్లు 'మిస్ పిక్నిక్.' పిక్నిక్ అయ్యే దాక దానిమాట మిగిలిన వారందరు విన వలసిందే' అంది.

సంభాషణలో అనుకోని ఈ పరిణామా నికి తత్తరపడింది సుగుణ. గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. మరొక్క క్షణమైనా అక్కడవుండ బుద్ధి కాలేదు.

'ఆ రోజావుప్వు 'మిస్ పిక్నిక్'కి బహు మతిగా పట్టుకొస్తానంటూ' ఎవరిమాటా వినకుండా త్వరగా నడవసాగింది సుగుణ.

వెనుకనుంచి నవ్వుకొంటున్నారు వాళ్ళు. ఎందుకో? తనను గురించా? ఏమో...!

*    *    *

ఆకాశంనిండా మబ్బులు కమ్ముకున్నాయి. సన్నని తుంపరలు పెద్దవై పెద్దవాన కురవసాగింది. సుగుణ కిటికీలో కూర్చుని బయటికి చూస్తోంది. ఇంటి చూరుమీద నుంచి జారిపడే వాన నీటిబొట్లు ఒక్కొ క్కటిగా జారి క్రిందనున్న కుక్కగొడుగు మీద పడుతున్నాయి. నీటిబొట్టు బరు వుకి కుక్కగొడుగు వొంగి తిరిగి యథా స్థితికి వస్తోంది. సుగుణ ఆసక్తిగా చూడ సాగింది. వాన యింకా పెద్దదయింది. చూరుమీదనుంచి జారిపడే ధారకూడ పెద్దదయింది. కుక్కగొడుగు విరిగి పోతుందా లేదా అని ఆసక్తిగా చూడ సాగింది. చివరికది ఒక ప్రక్కగా వొంగి పోయింది. ధార యిప్పుడు దానికి దూరంగా పడుతోంది.

ఇంతలో తలుపుకొట్టిన చప్పుడయింది. లేచివెళ్లి తలుపు తీసింది. అన్నయ్య వానలో పూర్తిగా తడిసి ముద్దయిపోయాడు. వణు కుతూ లోపలికి వచ్చాడు.

'సుగుణా! రేపు నా స్నేహితు డొకడు



వస్తున్నాడమ్మా' నిన్ను చూసుకోడానికి, చాలా మంచివాడులే. తప్పక నువ్వతనికి నచ్చుతావు' అని 'అమ్మా, అమ్మా' అంటూ వుత్సాహంగా లోపలికి వెళ్ళాడు.

'అదేమిట్రా, అలా తడిసిపోయావు. ముందు తలతుడుచుకొని పొడిబట్టలు కట్టుకో తరువాత మాట్లాడుదువు గాని' అంటోంది అమ్మ.

తెల్లవారింది!

అందరికన్నా ముందు అన్నయ్యే లేచి అమ్మను సుగుణను లేపాడు. అన్నయ్య కళ్ళల్లోకి చూసింది సుగుణ. అవి ఎర్రగా వుబ్బి వున్నాయి. రాత్రంతా నిద్రపోయి వుండడు. 'పిచ్చి అన్నయ్య' అనుకుంటూ పెరటిలోకి నడిచింది.

హాలులో గడియారం 'ఠంగు ఠంగు' మని తొమ్మిదిగంటలు కొట్టింది.

అందరూ హాలులోనే కూర్చున్నారు. అన్నయ్య మాత్రం ఆత్రతగా బయటికి మాటి మాటికి వెళ్ళి చూసి వస్తున్నాడు.

ఇంతలో పోస్ట్ అని కేక వినబడింది. అన్నయ్య సంతకం చేసి కవరు లోపలికి తీసుకొని వచ్చాడు. టెలిగ్రాం విప్పి చదివి నీరు కారిపోయాడు. నెత్తిన చేతులు వేసుకొని వుసూరుమంటూ కుర్చీలో కూలబడ్డాడు. శ్యామల అందుకొని టెలిగ్రాం చదివింది.

'డియర్ విశ్వం!

అనుకున్న విధంగా రేపు నేను రాలేక పోతున్నాను. క్షమించు.

నీ
రవి.

శ్యామల సుగుణవైపు చూసింది. సుగుణ నిర్లిప్తంగా గుమ్మంవైపు చూడ సాగింది.

సుగుణ తనకళ్ళను తానే నమ్మలేక పోయింది,

'రఘు!!' తన బావ గుమ్మంలో నుంచొని వున్నాడు. బావ ఆకస్మికపురాక హాలులోని వారందరకూ ఆశ్చర్యం కలిగించింది. సుగుణ మెల్లగా లేచి తనగదిలోకి వెళ్ళిపోయింది.

'ఏరా రఘూ, యిలా అకస్మాత్తుగా వూడిపడ్డావు. వుత్తరం ముక్కైనా రాస్తే స్టేషన్‌కి వచ్చేవాడిని కదా' అన్నాడు విశ్వం.

'లేదు బావా, అనుకోకుండా నా స్నేహితుడి పెళ్ళికి పక్కవూరువెళ్ళి తిరిగి వస్తుంటే దారిలో శకటం మొరాయించింది' అన్నాడు.

'లే నాయనా, పెరట్లో వేన్నీళ్ళు పెట్టా. స్నానం చెయ్యి' అంది అమ్మ.

గదిలోకి వచ్చి తనను బావ పలకరిస్తాడనుకొన్న చివరి ఆశకూడ నిరాశ అయింది సుగుణకి.

భోజనాల దగ్గరకూడా రఘు ఆమెతో మాట్లాడలేదు. నెయ్యి వడ్డిస్తూ రఘువి తాను గమనిస్తూనే వుంది. రఘు క్రీగంట శ్యామలను చూస్తున్నాడు. మధ్య మధ్య శ్యామలమీద జోక్సువేసి తాను, శ్యామల కూడా నవ్వుకుంటున్నారు.

'ఛీ, శ్యామలకైనా సిగ్గులేదు. ఏమిటా వెకిలినవ్వులు? భోజనాల దగ్గర' అనుకుంది సుగుణ.

భోజనాలయ్యాయి. సుగుణ తనగదిలో

వస్తున్నాడమ్మా' నిన్ను చూసుకోదానికి, చాలా మంచివాడులే. తప్పక నువ్వతనికి నచ్చుతావు' అని 'అమ్మా, అమ్మా' అంటూ వుత్సాహంగా లోపలికి వెళ్ళాడు.

'అదేమిట్రా, అలా తడిసిపోయావు. ముందు తలతుడుచుకొని పొడిబట్టలు కట్టుకో తరువాత మాట్లాడుదువు గాని' అంటోంది అమ్మ.

తెల్లవారింది!

అందరికన్నా ముందు అన్నయ్యే లేచి అమ్మను సుగుణను లేపాడు. అన్నయ్య కళ్ళల్లోకి చూసింది సుగుణ. అవి ఎర్రగా వుబ్బి వున్నాయి. రాత్రంతా నిద్రపోయి వుండడు. 'పిచ్చి అన్నయ్య' అనుకుంటూ వంటటింట్లోకి నడిచింది.

హాలులో గడియారం 'ఠంగు ఠంగు' మని తొమ్మిదిగంటలు కొట్టింది.

అందరూ హాలులోనే కూర్చున్నారు. అన్నయ్య మాత్రం ఆత్రతగా బయటికి మాటి మాటికి వెళ్ళి చూసి వస్తున్నాడు.

ఇంతలో పోస్టు అని కేక వినబడింది. అన్నయ్య సంతకం చేసి కవరు లోపలికి తీసుకొని వచ్చాడు. టెలిగ్రాం విప్పి చదివి నీరు కారిపోయాడు. నెత్తిన చేతులు వేసుకొని వుసూరుమంటూ కుర్చీలో కూలబడ్డాడు. శ్యామల అందుకొని టెలిగ్రాం చదివింది.

'డియర్ విశ్వం!

అనుకున్న విధంగా రేపు నేను రాలేక పోతున్నాను. క్షమించు.

నీ
రవి.

శ్యామల సుగుణవైపు చూసింది. సుగుణ నిర్లిప్తంగా గుమ్మంవైపు చూడ సాగింది.

సుగుణ తనకళ్ళను తానే నమ్మలేక పోయింది,

'రఘు!!' తన బావ గుమ్మంలో నుంచొని వున్నాడు. బావ ఆకస్మికపురాక హాలులోని వారందరకూ ఆశ్చర్యం కలిగించింది. సుగుణ మెల్లగా లేచి తనగదిలోకి వెళ్ళిపోయింది.

'ఏరా రఘూ, యిలా ఆకస్మాత్తుగా వూడిపడ్డావు. వుత్తరం ముక్కైనా రాస్తే స్టేషన్‌కి వచ్చేవాడిని కదా' అన్నాడు విశ్వం.

'లేదు బావా, అనుకోకుండా నా స్నేహితుడి పెళ్ళికి వెళ్ళావూరువెళ్ళి తిరిగి వస్తుంటే దారిలో శకటం మొరాయించింది' అన్నాడు.

'లే నాయనా, పెరట్లో వేన్నీళ్ళు పెట్టా. స్నానం చెయ్యి' అంది అమ్మ.

గదిలోకి వచ్చి తనను బావ పలకరిస్తాడనుకొన్న చివరి ఆశకూడ నిరాశ అయింది సుగుణకి.

భోజనాల దగ్గరకూడా రఘు ఆమెతో మాట్లాడలేదు. నెయ్యి వడ్డిస్తూ రఘుని తాను గమనిస్తూనే వుంది. రఘు క్రీగంట శ్యామలను చూస్తున్నాడు. మధ్య మధ్య శ్యామలమీద జోక్సువేసి తాను, శ్యామల కూడా నవ్వుకుంటున్నారు.

'ఛీ, శ్యామలకైనా సిగ్గులేదు. ఏమిటా వెకిలినవ్వులు? భోజనాల దగ్గర' అనుకుంది సుగుణ.

భోజనాలయ్యాయి. సుగుణ తనగదిలో

# వారఫలం

**16-8-1968 శుక్రవారం మొదలు**
**22-8-1968 గురువారం వరకు**

**మేషం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**వృషభం :** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. సాహసంతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మిథునం :** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :** వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం :** ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

**కన్య :** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారం ఆఖరులో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**తుల :** కొన్ని వ్యవహారాల్లో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం :** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను వ్యతిరేకత యేర్పడుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో నష్టం వస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు :** కొన్ని పనులు సులువుగా నెరవేరినా, మరికొన్నింటిలో శ్రమ కలుగుతుంది. వృత్తిలో సాటివారితో పోటీ పెరుగుతుంది. సాంఘిక వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**మకరం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం :** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. నూతన వ్యవహారాలు శ్రమ మీద ఫలిస్తాయి. సాటివారితో మాటపట్టింపులు రావచ్చును. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**మీనం :** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు అనుకూలంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. మీరు మొగమాటాలకు లొంగిపోవడం వలన అనవసరమైన శ్రమకు గురి కాగలరు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

— మహేష్



విజయలక్ష్మి



నున్నటి తారురోడ్డు మీద రయ్యిమని దూసుకు పోతోంది నీలిరంగు ఎంబాసిడరు.

మల్లన్న కూనిరాగం మెల్లిగా గాలిలో తేలిపోతూండగా, మువ్వలు ఘల్లు ఘల్లు మనిపించుకుంటూ చెంగు చెంగున సాగి పోతోంది సైకిలు రిక్షా.

*పరిసరాలని చుట్టివున్న సంజె వెలుగుని మింగేస్తూ చీకట్లు అలుముకుంటూండే ఆ చీకటిలోకి అలా దూరంగా చూస్తూ పరధ్యానంగా కూర్చుంది సుజాత-*

ఉన్నట్లుండి ఆమె గుండెలని చీల్చుకు వచ్చిన ఆర్తనాదంలాంటి కెవ్వుమన్న కేక గాలిలో ప్రతిధ్వనించటం, 'అమ్మో' అంటూ వళ్లు తెలియని భయంతో మల్లన్న ఒక్క కేక పెట్టటం, సడన్ బ్రేకుతో కీచు మంటూ కారు ఆగటం అన్నీ ఒక్కసారే జరిగాయి.

బ్రతుకుమీద ఆశ వదులుకున్న కూడా లేని శక్తి తెచ్చుకుని చరున ప్రక్కకి తప్పుకో బోయిన మల్లన్న ప్రమాదం తప్పిపోయిందని గ్రహించి కొండంత సంబరపడిపోతూ ఒక్క క్షణం గుండెలనిండా వూపిరి పీల్చుకోటానికి రిక్షా ఆపి అప్రయత్నంగానే ప్రక్కకి తిరిగి చూశాడు, తలపాగ కొనతో మొహం తుడుచుంటూ.

అదే సమయంలో విసుగ్గా నోరుతెరుచుకుని 'రాస్కెల్, అంతసేపటినుంచి హారన్ కొడుతూంటే వినిపించటంలేదూ' అంటూ దూకుడుగా వచ్చిన శ్రీధర్ మల్లన్నని చూడగానే గుర్తుపట్టినట్లు ఒక్కక్షణం ఆగి

# కొత్త సీరియల్ ప్రారంభం

'నువ్వైనా ఇంత ఘనకార్యం చేసినవాడివి. ఏం? అప్పుడే డోసు వేసుకున్నావా లేకపోతే ఒళ్ళు దగ్గర పెట్టుకుని రిక్షా తొక్కాలన్న సంగతి మరిచిపోయావా...' అన్నాడు. కోపంతోపాటు చనువుతోకూడిన మందలింపు కూడా ధ్వనించింది అతనిమాటలలో— మల్లన్న సీటు మీదనుంచి దిగి 'తప్పయిపోయింది బాబూ— ఏదో ఆలోచిస్తున్నాను. హారన్ వినిపించి ప్రక్కకి తప్పుకోబోయే సరికి కారుమీదకి వచ్చేసింది. ఎదురుగా లారీవస్తోంది—చచ్చిపోతామనే అనుకున్నాము— మీరు ఇవాళ మా ప్రాణాలు కాపాడారు.' చేతులు నలుపుకుంటూ తప్పు ఒప్పుకుని కృతజ్ఞత తెలుపుకున్నాడు.

'కబుర్లు మాత్రం బాగా చెప్తావు— ఇంకనైనా జాగ్రత్తగా తీసుకువెళ్ళు ఆవిడ్ని. మళ్ళీ ఎప్పుడూ ఇలా నడిరోడ్డు మీద నిద్దరపోతూ రిక్షా తొక్కకు—చూడు



# సుజాత

మరో సంగతి, అలా ఎనిమిదిమూరల గుడ్డ చెవుల చుట్టూ చుట్టుకుని కూర్చున్నావంటే కారుహారను, పోలీసు విజిలు ఏవీ వినిపించవు.' అని వెళ్ళిపోతూ ఓసారి రిక్షాలోకి చూశాడు.

క్షణం క్రితం జరగబోయింది తలుచుకుంటూ భయంతో ఒళ్ళంతా గబగబలాడిపోతుంటే బిక్కుబిక్కుమంటూ ఓ ప్రక్కకి ఒదిగి కూర్చుంది సుజాత. గుండెలు పగిలిపోతాయేమో నన్నంత వేగంగా అదిరిపోతున్నాయి. ఒళ్ళంతా చెమటలు కమ్మేశాయి. రిక్షా కదులుతున్నంతసేపు గాలికిరేగి ఆమె నుదిటిమీద అందంగా ఇటూఅటూ ఎగిరిన ముంగురులు ఇప్పుడు చెమటతో తడిసిన మొహంమీద అడ్డదిడ్డంగా అతుక్కుపోయాయి. వాటిని వెనక్కి తీసుకోవాలనే ధ్యాసయినా లేకుండా రెండు చేతులూ ముడుకుని వాళ్ళ సంభాషణ వింటూ కూర్చున్న ఆమెకి అతను అటువైపు తిరగ్గానే చటుక్కున కర్తవ్యం స్ఫురించినట్లయింది.

'చాలా థ్యాంక్సండీ' అంది తడబడుతూ. వెనక్కి తిరిగి వెళ్ళిపోతున్న అతను క్షణం ఆగి, 'హో మెన్షన్' అని 'అయినా ఆ థ్యాంక్సేవో మనందరం ముందర ఆ దేవుడికి చెప్పుకోవాలి' అనేసి వెళ్ళిపోయాడు. కారు కదిలిపోయింది.

'చలిగా వుందని చెవులచుట్టూ కప్పుకున్నాను. చినబాబు బాగా చెప్పాడు' 'సిగ్గుపడుతున్నవాడిలా తనలోతనే అనుకున్నట్లు కాస్త పైకే అంటూ పాగా సవరించుకున్నాడు మల్లన్న.

'ఆ బాబు నీ కింతకుముందు తెలుసా?' యాదాలాపంగానే అడిగింది సుజాత.

'తెలియటం ఏమిటి? వాళ్ళింట్లో కొన్నాళ్ళ పనిచేశాను— చాలా రోజులయిపోయింది — అమ్మగారు చిన్నబాబు చాలా మంచివాళ్ళు. పెద్దబాబు మంచోయనే కాని కాస్సంత కోపం మాత్రం ముక్కుమీదుంటుంది' ఉత్త పరిచయమే కాదు వాళ్ళ విషయాలన్నీ తనకి తెలుసునన్నంత గర్వంగా చెప్పాడు గబగబ రిక్షా తొక్కుతూ.

'మరి హాయిగా ఆపనిలోనే వుండక ఈ రిక్షా పెట్టుకున్నావెందుకూ.'

మల్లన్న హేండిల్ మీదనుంచి ఓ చెయ్యి తీసి నుదిటిమీద ఈ చివరనుంచి ఆ చివరదాకా రాస్తూ 'బ్రహ్మదేవుడిలా రాసిపడేశాడు. తప్పుతుందా మరి' అన్నాడు పెద్ద వేదాంతిలా.

సుజాత కుతూహలం అణచుకోలేకపోయింది. 'అసలేమయింది పనెక్కువగా వుండేదా — జీతం బాగా ఇచ్చేవారు కదా' అంది—వీడు ఒళ్ళువంచి పనిచెయ్యకపోతే పెద్దబాబుగారు తీసేసివుంటారు. అందుకే ఆ బాబుకి ముక్కుమీదకోపం వుంటుందని ముందేచెప్పి తన అక్కసు తీర్చుకున్నాడు అనుకుంది.

సుజాత చెప్పిన కారణాలేవీ కాదన్నట్లు తల అడ్డంగా వూగించాడువాడు. 'బోలెడు తీరికవుండేది—ఏం తోచక ఇక్కడా అక్కడా పడి నిద్దపోతుంటే అమ్మగారు కేకలేసి చదువుచెప్పటం మొదలుపెట్టారు. మొదట్లో బలే విసుగనిపించింది కాని పదిరోజులు పోయేసరికి సరదా పుట్టింది— 'చక్కగా మెట్రిక్ పరీక్షకి కట్టు. అయ్యగారితో చెప్పి మంచి కొలువిప్పిస్తాను' అంటూ సంబరపడిపోయేవారు అమ్మగారు...'

'ఏమిటీ, నువ్వు మెట్రిక్ ప్యాసయ్యావా?' ఆశ్చర్యాన్ని ఆసక్తిని అణుచుకోలేక మధ్యలోనే అడిగింది సుజాత—నిరుద్యోగ సమస్య భూతంలా దేశాన్నిపట్టి పీడిస్తున్న ఈ సమయంలో బి. ఏ, ప్యాసయినవాళ్ళు కూడ గత్యంతరం లేక హోటల్ సర్వర్లుగాను, బ్యాంకి బంట్రోతులుగానూ పనిచెయ్యటానికి కూడ సిద్ధపడుతున్నారని చెప్పారు ఆ మధ్య ఎవరో — ఎవరో అంటూంటే వినడమే కాదు అలాంటివాడిని ప్రత్యక్షంగా చూస్తున్నానిప్పుడు అనిపించింది—

సమాధానం కోసం ఎదురుచూస్తున్న సుజాత,

'లేదమ్మగారు—శనిదేవత నా నెత్తినెక్కి కూర్చుంటే అంత అదృష్టం పడుతుందా—ఎనిమిదో తరగతి పుస్తకాలు పూర్తిచేశాను. ఆ తరువాత ఇదిగో ఇలా బ్రతుకుతున్నాను' అంటూ వాడు నిట్టూర్చడంతో,

'అసలెందుకు మానేశావు' అని అడిగింది. వాడి మాటలు వింటున్నకొద్దీ వాడి కథలో ఆసక్తి కూడ అధికం కాసాగింది.

'ఎందుకేమిటి ఈ పాడుజన్మ ఇలా వెళ్ళాల్సి వుంది—అందుకే ఆనాడు అలాంటి దుర్బుద్ధి పుట్టింది'—గతంలో జరిగిపోయిన సంఘటనల తాలూకు జ్ఞాపకాలు. వర్తమానంలోని అసంతృప్తి సంక్షోభం వాడి గొంతుని బరువుగా భారంగా మార్చేశాయి.

ఇంక ఏమీ చెప్పలేనట్లు [illegible] దుఃఖంతో మునిగిపోయాడు.

'వాడి ప్రతి అక్షరంలోనూ ప్రతిధ్వనిస్తున్న బాధ, వాడి అణువణువులోనూ ప్రస్ఫుటమవుతున్న పశ్చాత్తాపం స్పష్టంగా తెలుసుకోగలిగిన సుజాత వాడిని ఇంకే ప్రశ్నలు అడగలేదు.

'ఏం చేశాడో — పాపం ఇప్పుడెంత బాధపడితే ఏం లాభం—వోనాడు చేసిన వెధవపని వల్ల వాడి ఆశలు ఆశయాలు అన్నీ బుగ్గిపాలయిపోయాయి—జీవన గమనాన్ని వక్రగతి పట్టించి, జీవితాన్ని అధోగతి పాలుచేసే దుష్టక్షణాలు కొంతమందికి ఎదురవుతూంటాయి — అలాంటి భయంకరమైన క్షణం ఒక్కటి చాలు మనిషి మళ్ళీ తలెత్తుకోలేకుండా చెయ్యడానికి...' ఆలోచనలలో మునిగిపోయి మౌనంగా వుండిపోయింది ఆమె కూడా.

కోటీచర్ యామిని మూడురోజులనుంచి జ్వరంతో లేవటంలేదు అన్న సంగతి మధ్యలో గుర్తువచ్చి, ఆమెనోసారి చూసివస్తే బాగుంటుందనిపించి రిక్షా అటువేపు తిప్పమంది.

* * *

'నా ఆలశ్యం ఏం లేదమ్మా — వడ్డించనా?' అంటూ వంటగదిలో నుంచి కేకవేసింది మీనాక్షమ్మ.

# సుజాత

గదిలో అద్దం ముందు నిలబడి ముస్తాబవుతున్న సుజాత, 'అయిపోయింది-ఒక్క నిముషం.' అని సమాధాన మిచ్చింది.

'టీచర్, ఇవాళ అన్ని స్కూళ్ళకీ శలవ ఇచ్చేశారుగా — మీ స్కూలుకివ్వలేదూ?' దగ్గిరగా వేసి వున్న తలుపులు తోసుకుని లోపలికి వచ్చిన ప్రమీల సుజాత ఎక్కడికో వెళ్ళే ప్రయత్నంతో వుండటం గమనించి అడిగింది. అయిదవ తరగతి చదువుతున్న ఆ అమ్మాయి ఎప్పుడయినా వచ్చి తనకి తెలియని పాఠాలు సుజాత చేత చెప్పించుకుంటూ వుంటుంది.

పదేళ్ళయినా నిండని ఆ పాపకి మరో ఇద్దరు చెల్లెళ్ళు ఇద్దరు తమ్ముళ్ళూ వున్నారు—ఇంట్లో చాకిరీ, పిల్లల్ని చూసుకోటం వాళ్ళకి రోగాలు మందులూ మాకులూ వీటితో ఈసురుమంటూ వుండే తల్లికి ప్రమీల చదువు విషయం కనుక్కునే పాటి ఓపికా వ్యవధీ కూడా వుండవు—తండ్రీ కూడ అంతంత మాత్రం వాడే — చాలీచాలని జీతంతో రోజు రోజుకి పెరిగిపోతున్న ఈ ధరలని అందుకోలేక సంసార భారాన్ని మోయలేక ఆ చిరాకునీ కోపాన్ని ఇతరులమీద అంటే తనకి లోకువగా వున్న వాళ్ళమీద చూపించుకునే ప్రబుద్ధుడాయన. ఎంత లోకువయినా ఆఫీసులో అకారణంగా మాటలంటే ఎవరూ పడివుండరు కనకా తను ఎన్ని అన్నా నోరు మూసుకుని అణగిమణిగి వుండేది భార్య ఒక్కతే కనకా అయిన దానికీ కాని దానికీ ఆమె మీద విరుచుకుపడి, ఇంకా కోపం తీరకపోతే పిల్లల్ని నాలుగు వాయించేవాడు. ఆ సంసారాన్ని చూస్తూంటే మీనాక్షమ్మగారిలాంటి వాళ్ళకి కూడా, అంటే—

'పదిమంది బిడ్డా పాపాతో ఏ ఇల్లు కలకల లాడాలి' అంటూ కనిపించిన వాళ్ళందర్నీ నోటినిండా ఆశీర్వదించే పాతకాలపు అలవాటు కలవాళ్ళకి కూడ భయం పుట్టుకొస్తుంది.

'ముచ్చటగా ఇద్దరో ముగ్గురో వుంటే చాలు. వాళ్ళకి ఏ కొరతా లేకుండా హాయిగా ఆరోగ్యంగా పెంచి చదువు చెప్పించి వృద్ధిలోకి తీసుకు రాగలిగితే అదే పదివేలు.' అనిపిస్తుంది—అసలు ఒకరికి అనిపించటం ఏమిటి, తా మిద్దరిలో ఎవరో ఒకరు ఆపరేషన్ చేయించుకోవాలని నాలుగేళ్ళ క్రిందటే ప్రమీల తల్లిదండ్రులకి ఆలోచన వచ్చింది. అయితే దాన్ని ఆచరణలో పెట్టే తెగింపే వాళ్ళకి లేకపోయింది — ఆలోచన సాగుతోనే వుంది — రోజులు గడిచిపోతూనే వున్నాయి — మరో ఇద్దరు పిల్లలుకూడ పుట్టారు.

ఆరునెలల క్రితందాకా సుజాతావాళ్ళు ప్రమీలావాళ్ళ పొరుగునే వుండేవారు. కష్టపడి చదువుకోవాలి. ఎప్పుడూ ఫస్టుమార్కులు తెచ్చుకోవాలి అని ఆ పిల్లపడే ఆరాటం చూస్తే సుజాతకి ఎంతో ముచ్చట వేసేది — ఆపిల్ల ఆసక్తిని అర్థం చేసుకోకుండా, అయిదునిమిషాలు చెప్పిన పాఠంలో నాలుగు వీధులకి వినిపించేలా అరిచి చివరికి పుస్తకాలు విసిరేసి లేచి వెళ్ళిపోయే తండ్రినిచూస్తే ఎంతయినా చిరాకువచ్చేది. చివరికి ఒకనాడు తనే అంది, 'నీకు తెలియనివి నేను చెప్తూంటాను—మా యింటికి వస్తూండు' అని తరువాత సుజాతా వాళ్ళు ఇల్లు మారినా ప్రక్క వీధే కనక ప్రమీల రావటం మానలేదు.

'నేనీ టీచరు వుద్యోగం మానేశాను ప్రమీలా' అంది సుజాత ఆ అమ్మాయి



అడిగినదానికి సమాధానంగా

'అయ్యో—నిజంగానేనా?' అంది ప్రమీల బోలెడు దిగులుపడిపోతూ. ఆ పిల్ల మొహం చూస్తే సుజాతకి నవ్వూ జాలీ కూడ ముంచుకువచ్చాయి.

తిలకం దిద్దుకోటం పూర్తిచేసి, చనువుగా ఆ పిల్ల భుజాలచుట్టూ చెయ్యి వేస్తూ. 'నేనే వుద్యోగంలో వున్నా నీకు మాత్రం టీచర్నిలే— కావలసిన పాఠాలు చెప్పించుకుని వెళ్తూండు' అంది.

చూస్తూండగానే ప్రమీల మొహంలోకి పోయిన కళ అంతా తిరిగి వచ్చింది. ఎంతో సంబరపడి పోయింది. 'హాకీ లెక్కలు కొంచెం...' అంటూ పుస్తకం తెరుస్తూంటే,

'ఇప్పుడు నేను ఆఫీసుకి వెళ్ళాలి కదమ్మా. సాయంకాలం రా' అని ఆ అమ్మాయిని పంపించేసి తను భోజనంచేసి బయలుదేరింది.

ఈవూరు వచ్చిన కొత్తలో ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్న సుజాత ఏదైనా స్కూల్లో దొరికితే బాగుండునని అభిప్రాయపడింది. ఆడవారికి అన్ని విధాల టీచింగ్ లైనే బాగుంటుందని ఆమె ఉద్దేశ్యం.

'ఉద్యోగం చెయ్యాలనుకున్న ఆడవాళ్ళంతా పంతులమ్మలే కావాలనుకుంటే ఎలా కుదురుతుంది — అయినా ఇంకో మూడునెలల్లో శలవలిచ్చేస్తారు. ఇప్పుడే స్కూల్లోనూ దొరకదు — అప్లికేషన్లు పెట్టొచ్చు. ఎవరికన్నా అవసరం అయితే శలవలాఖరికి తీసుకుంటారు -- ఈలోగా వూరికే కూర్చోటం ఎందుకు, టైపు నేర్చుకుంటే ఎందుకయినా పనికి వస్తుంది. టైపిస్టులుగా పని చేస్తున్న అమ్మాయిలు బోలెడు మంది వున్నారు. అంటూ సలహా ఇచ్చాడు ఇంటి యజమాని.

అంతగా ఇష్టం లేకపోయినా టైపు నేర్చుకోటం- మొదలు పెట్టింది సుజాత ఏదో ఓ వుద్యోగం చెయ్యదలుచుకుంది కనక — పద్దెనిమిది నెలలు తిరిగే సరికి టైపు పరీక్ష ప్యాసయింది — సరిగ్గా ఆ సమయంలోనే ఓ స్కూలు నుండి వుత్తరం వచ్చింది. ఓ టెంపరరీ వేకెన్సీ వుందనీ, సుజాత ఇంకా ఖాళీగానే వుంటే వచ్చి చేర వచ్చుననీ వాళ్ళు వ్రాశారు—వెంటనే వెళ్ళి

# సుజాత

అందులో చేరింది — ఆమె అదృష్టం బాగుండటం వల్ల ఆ నాలుగు నెలలూ గడిచేసరికి మరో ఆవిడ మూడు నెలలు శలవ పెట్టింది. సుజాతని మళ్ళీ ఆ వేకెన్సీలో వేశారు.

'పోనీలే — ఇలా కొన్నాళ్ళు గడిచిపోనీ — అసలు మాకు మరో హేండు కావాలని పోయిన సంవత్సరమే కమిటీలో వోట్ పెట్టాం. త్వరలోనే వాళ్ళు శాంక్షను చెయ్యొచ్చు. అప్పుడు నిన్ను పెర్మనెంటు చేస్తాం.' అని ధైర్యం చెప్పింది ఆ హెడ్ మిస్ట్రెస్ సుమిత్రాదేవి.

ఆ మూడునెలలూ గడిచి ఆవిడా వచ్చేసింది.

'ఇప్పుడున్నవాళ్ళే మరో రెండేసి పిరియడ్లు ఎక్కువగా తీసుకుని సర్దుకోండి —మీరో టీచర్‌ని పెర్మనెంటు చెయ్యటానికి ఫండ్సులేవు.' అనేశారు కమిటీ మెంబర్లు. 'ఇప్పటికే ఆ టీచర్లకి లీజర్ అవర్సు చాలా తక్కువగా వున్నాయని, మరో మనిషి చెయ్యాల్సిన పనిని వాళ్ళనే సర్దుకోమనటం భావ్యంకాదని అనిపించినా అప్పట్లో ఇంకేం చెయ్యలేమనేశారు వాళ్ళు.

కాస్సేపు అయ్యో అనిపించినా 'ఏం చేస్తాను—ఏదో ఓదారి దొరక్కపోదు — ఆ హెనుమాయమ్మగారినే అడుగుతాను మరోసారి' అనుకుంది సుజాత.

ఆ కొద్దిరోజుల పరిచయంతోటి సుజాత అంటే ఓ మంచి అభిప్రాయమూ అభిమానమూ ఏర్పరచుకున్న సుమిత్రాదేవి 'పాపం ఆ అమ్మాయికి లేనిపోని ఆశ కూడ పెట్టాను— అయినా నాకేం తెలుసు వీళ్ళిలా చేస్తారని' అనుకుని జాలిపడి, 'నువ్వు టైపు పరీక్ష ప్యాసయ్యానన్నావు కదూ — అన్నపూర్ణ ఇంజనీరింగు వర్క్సు) వాళ్ళకి టైపిస్టు కావాలిట, మొన్నటి డెక్కన్ క్రానికల్ చూడు—మాకు తెలిసిన వాళ్ళమ్మాయి అప్లై చేస్తోంది— ఎవరికి ప్రాప్తం వుంటే వాళ్ళకి వస్తుంది.' అని సలహా ఇచ్చింది.




ఆఫీసులో టైపిస్టు వుద్యోగం అంటే అంత ఇష్టం లేకపోయినా అప్లై చేసింది సుజాత అవసరం కనక — వారం తిరిగేసరికి ఇంటర్వ్యూకి పిలుపు వచ్చింది— ఆమెకిది క్రొత్త అనుభవం — అక్కడెంత మంది వుంటారో ఏమేం అడుగుతారో అని భయపడిపోయింది— 'దానికో పద్దేం లేదమ్మా— ఆవగింజ నుంచి అణ్వస్త్ర ప్రయోగాల దాకా వాళ్ళ ఇష్టం వచ్చినవి అడుగుతారు — అయినా వీళ్ళు పిలిచింది టైపిస్టు ఉద్యోగానికి కనక ఓ ఇన్ని కాగితాలు టైపుచేసి చూపించమంటారేమో—అయినా భయపడాల్సిందేం లేదు— నీలాంటి వాళ్ళు చాలా మంది వస్తారు.' అంటూ ఈ ఇంటి యజమాని జగన్నాధం గారు ధైర్యం చెప్పబోయారు కాని నిజంగా అలాంటి ప్రశ్నలు వేస్తారా అని సుజాత ఇంకా హడలి పోయింది.

ఉదయం తొమ్మిదిన్నరకే ఖంగారులో నయించి నయించక కాస్త అన్నం తిని కావలసిన కాగితాలన్నీ హేండుబేగ్‌లో సర్దుకుని దడదడలాడే గుండెలతో బయలుదేరింది — సుజాత కాక మరో నలుగురమ్మాయిలున్నారు. ముగ్గురు మొగవాళ్ళు కూడ వచ్చినట్లు ప్యూన్ దగ్గర నుంచి ఇన్‌ఫర్మేషన్ లాగింది ఓ అమ్మాయి.

లిప్‌స్టిక్‌లూ, పిచ్చికగూడు లాంటి హేర్‌స్టైలూ స్లీవ్‌లెస్ జాకెట్లూ — బుజం మీద నిలవకుండా జారిపోతున్న టెరిలిన్ పమిటలూ, మోకాళ్ళ పైకివున్న ఫ్రాకులతో వున్న వాళ్ళంతా కిచకిచలాడుతున్నట్లు మాట్లాడేసుకుంటూ హైహీల్స్ షూస్ టకటకలాడేలా చకచక ఇటూఅటూ తిరిగేస్తూంటే వాళ్ళకి తనలా అసలు భయం వేయటం లేదా అనిపించింది సుజాతకి—అంతేకాదు ఇలాంటి ఉద్యోగానికి అలా చలాకీగా వుండేవాళ్ళే కావాలేమో, ఉన్న జాడయినా తెలియకుండా ఓ మూల ఒదిగి కూర్చుని సాదా వాయిలు చీరలో అతి సామాన్యంగా వున్న తను యజమానుల దృష్టిలో అసలు పడనే పడనేమో అనిపించింది:

పదకొండయింది — కాంపౌండులో కారు హారన్ వినిపిస్తూనే, నోసారి బాక్కాని లోంచి తొంగిచూసి హడావిడిగా పరుగెత్తుకు వెళ్ళాడు ప్యూన్ — తరువాత కాస్సేపటికే ఒక్కొక్కరికే పిలుపు వచ్చింది—

అరచేతులలో పట్టిన చిరుచెమటని రుమాలుతో తుడుచుకుంటూ, తడబడుతూ మెల్లిగా ఆఫీసు గదిలో అడుగుపెట్టిన సుజాతకి ప్రొప్రయిటరు నీలకంఠంగారు మేనేజరు సీతాపతిగారు ఆదరంగా మాట్లాడటంతో కొంత ధైర్యం వచ్చింది— పైగా వాళ్ళు ఆమె భయపడినట్లు పెద్ద పెద్ద ప్రశ్నలేమీ వెయ్యలేదు. ఆమె కుటుంబం గురించీ అసలామెకి ఉద్యోగం యొక్క అవశ్యకతని గురించీ ఏవో అడిగారు — తరువాత అండర్ని కొన్ని ఉత్తరాలు టైపు చెయ్యమన్నాడు—పరీక్ష ప్యాసయినా ఈమధ్య అలవాటు లేకపోవటంవల్ల సుజాత కొంచెం తడబడింది—ఎలా చూసినా తనకా ఉద్యోగం రాదని నిరాశ చేసుకుంది. కాని నాలుగు రోజులు గడిచేసరికి వెంటనే వచ్చి జాయిన్ అవమంటూ ఆర్డర్ రావటం ఆ అమ్మాయికే ఆశ్చర్యం అనిపించింది.

ఆ సాయంకాలమే స్కూలుకి వెళ్ళి హెడ్ మిస్ట్రెస్‌కి కృతజ్ఞత తెలుపుకుంది. ఆవిడ సుజాతని అభినందిస్తూ, 'చూశావా, మా వాళ్ళమ్మాయి ప్రయత్నిస్తోందని చెప్పానే, ఆ అమ్మాయికి జ్వరంవచ్చి అసలు ఇంటర్వ్యూకే వెళ్ళలేదుట — ఎవరికేది ప్రాప్తమో చెప్పలేం' అంది.

అన్నపూర్ణ ఇంజనీరింగు వర్క్స్ వాళ్ళ ఫ్యాక్టరీ హైదరాబాదునుండి సనత్ నగర్‌కి వెళ్ళేదారిలో ఉంది— ఆ ఫ్యాక్టరీలో యంత్రాల విడిభాగాలు తయారవుతాయి.

అబిడ్సులో వున్న ఓ పెద్ద భవనం మొదటి అంతస్తులో ఆఫీసు వుంది—మెట్లు మీదుగా పైకి వచ్చి కుడిచేతి వైపు వరండాలోంచి కారిడార్‌లోకి వస్తే ముందు వుండే ఎయిర్ కండిషన్డు గది ప్రొప్రయిటరుగారిది— మరి కొంత ముందుకి వెడితే ఓ పెద్దహాలు అందులో అరడజను టేబిల్సు కుర్చీలు వున్నాయి—హాలుని ఆనుకుని వున్న మరో గది గుమ్మానికి వి. సీతాపతి, మేనేజరు అన్న బోర్డు వుంది. ఆఫీసులో నలుగురు పూర్తిగా ఫ్యాక్టరీకి సంబంధించిన విషయాలే చూస్తుంటారు— స్వంతంగా పెట్టుకున్న ఈ చిన్న ఫ్యాక్టరీయే కాకుండా ఇంకా చాల సంస్థలలో నీలకంఠంగారికి షేర్సు వున్నాయి. కొన్ని ఫ్యాక్టరీలకి డైరక్టరు. మరింకా ఎన్నో కంపెనీలకి మేనేజింగ్ పార్ట్‌నరు — వాటికి సంబంధించిన విషయాలన్నీ మరో అతను చూస్తుంటాడు. టైపిస్టు మాత్రం ఒక్కడే. అదివరకు వుండే అతనికీమధ్యే పెద్ద వుద్యోగం వచ్చి వెళ్ళిపోతే ఆ పోస్టుకి సుజాతని తీసుకున్నారు.

రెండురోజులు గడిచేసరికి సుజాతకి పని బాగా అలవాటయి పోయింది—స్టాఫంతా చాలా మంచివాళ్ళు. మర్యాదగా ప్రవర్తించే వాళ్ళు. సీతాపతిగారికి కొంత వయస్సు ముదిరిపోవటం వల్ల మధ్య మధ్య చిరాకు పడినా తెలియనివన్నీ చెప్పి కన్న బిడ్డలాగే చూసుకుంటున్నారు.

'బాబుగారి మాట కరుకుగాని మనస్సు చాలా మంచిది' అంటూ అడగకుండానే నీలకంఠంగారిని గురించి చెప్పి భయపడాల్సిందేం లేదు అన్నట్లు సూచించాడు. నీలకంఠంగారిది కొంత చిరుబుర్రులాడే స్వభావం అని వచ్చిన మర్నాడే గ్రహించేసింది సుజాత. అయినా తను శ్రద్ధగా పనిచేస్తూ అణకువగా మసలుకుంటూంటే భయపడాల్సిందేం లేదు అనిపించింది.

ఆయనకి అహంకారం అహంభావం పాళ్ళు ఎక్కువే అని, ఆయనతో పడకనే అదివరకు టైపిస్టు మానేశాడని ఓ వార్త అందించాడు ఎక్కౌంటెంటు నారాయణరావు ఓరోజు మాటల సందర్భంలో.

'డబ్బుగలవాళ్ళ తీరే అంతిలెండి — అయినా నాకు ఎవరితోనూ పడకపోవటం అంటూ వుండదు సర్దుకుపోగలను' అనేసిందేకాని ఎలాంటి గొడవలూ రాకుండా ఈ ఉద్యోగం అయినా నిలకడగా వుంటే బాగుండును అనుకుంది లోలోపలే.

ఆ ఉద్యోగంలో చేరి అప్పటికి నాలుగు రోజులే కావటంవల్ల ఇంకా ప్రమీలా వాళ్ళదాకా వెళ్ళే అవకాశం లేకపోయింది

(ఇంకా ఉంది)

# మహీధరోక్తులు

మహీధర నళినీమోహనరావు

అనగననగ బొంకులలరారు నిజములై
తినగ తినగ తిట్లు దీవెనలగు
సాధనమున పనులు సమకూరు ధరలోన
హృదయవర్తి యీ మహీధరోక్తి.

శత్రు వెత్తిరాగ శాంతిగీతి యటంచు
ముక్కు మూసికొనిన ముప్పు వచ్చు
కుట్టుకున్న తేలు కుమ్మరి పురువండ్రు
హృదయవర్తి యీ మహీధరోక్తి.

అధమ విషయభోగ మల్పు నాకర్షించు
జ్ఞాని మాడబోడు దానివంక
ఇనుము లాగు రాయి కనకమ్ములాగునా?
హృదయవర్తి యీ మహీధరోక్తి.

గంతలోన బావగారుండిరని లఘు
శంకకై యొకర్తె సంతకేగె
చలముగారి మతము ఫలమిట్టులుండురా!
హృదయవర్తి యీ మహీధరోక్తి.




హితముత్పలాక్షి విత్తమ్ము పరహస్త
పరములయ్యెనేని తిరిగి రావు
వచ్చెనేని జీర్ణభ్రష్ట ఖండమ్ములౌ
హృదయ వర్తి యీ మహీధరోక్తి.


ఒరేయ్ సినిమాకి తీసి కెళ్తావురా...!
అమ్మ చెప్పిన పని

మాతృవాక్య పరిపాలన అంటే తెల్సానీకూ! రామాయణం విన్లేదా అసలు?

!
ఇప్పుడూ మా అమ్మ చెప్పిన పని చెయ్యాలి...!

వానొచ్చేటట్లుందే!



ఏమైనా సరే నే పోతున్నా!
!


చూదాం! ఏం చేస్తున్నాడో...!


!



# సంసారానికి సంకెళ్ళు

అత్తిలి వెంకటరత్నం

(గత సంచిక తరువాయి)

రమణమూర్తికి ఏంచేయాలో అర్థం కాలేదు. అయితే తను భయపడుతున్నది నిజమేనా? పోతే ముగ్గురం కలసి వెళ్దాం అని ఎందుకని అనలేక పోయింది తను? తను కూడా రావడం కూడా సహించలేదా? ఛ! తను అనవసరమయిన ఆలోచన చేస్తున్నాడు. శ్యామల మరొకరితో కొంచెం చనువుగా ఉంటే తను తప్పు పట కూడదు. యీ కాలంలో అందరికీ సోషల్ మూవ్‌మెంట్ పెరిగింది. యింతలోకే తను అనుమానిస్తే తన పరువు, సంస్కారం ఏమి కావాలి? తనతో కొంత కాలంగా ముభావంగా ఉండటానికి కారణం మరేదో ఉండి ఉంటుంది. కొన్నాళ్ళు విశ్రాంతిగా వదిలేస్తే మళ్ళీ మామూలుగా అవుతుంది. తను అంతవరకూ సహనం చూపాలి. ఒకసారి నిట్టూర్చి కుర్చీలో వెనక్కి వాలి కూర్చున్నాడు.

తరువాత అరగంటకి జగన్నాథం వచ్చాడు.

రమణమూర్తి లేచి రండి అని ఆహ్వానించాడు.

"యివాళ యీ సమయానికి ఇంట్లో ఉన్నారే. మీ హాస్పిటల్ మీద విరక్తి కలిగిందేమిటి? రమణమూర్తి పరిహాసం చేశాడు. శ్యామలా జగన్నాథం వచ్చాడు.

"యింకేం మీకూ ఖాళీయే కదా! రవీంద్ర భారతిలో మంచి డాన్సు ప్రోగ్రాం ఉంది. ముగ్గురం వెళ్దాం రండి. మీరు బయటికి వచ్చి చాలా రోజులయింది కదా! జగన్నాథం అన్నాడు.

"నాకు తల నొప్పిగా ఉండి త్వరగా వచ్చేశాను. మీరిద్దరూ వెళ్ళిరండి. రమణమూర్తి సహజంగా అనడానికి ప్రయత్నించాడు.

జగన్నాథం మళ్ళీ అడగబోయి అంతవరకూ శ్యామల అక్కడే ఉండి కూడా ఏమి అనకపోవడం చూసి తను యింక ఊరుకున్నాడు.

"పెందరాళే వచ్చెయ్యి. నాని నువ్వు లేకపోతే ఏడుస్తాడు లేచాడంటే. యీమధ్య వాడ్ని పట్టుకోడం కష్టంగా ఉంది. రమణమూర్తి వాళ్ళు వెళ్తూ ఉండగా అన్నాడు.

అది వ్యంగ్యార్థంగా తీసుకుని శ్యామల ముఖం కోపంతో ఎర్రబడిపోయింది. జగన్నాథంకూడా లోలోన చాలా సిగ్గుపడ్డాడు. బయటికి వచ్చిన తరువాత అన్నాడు. "ఛ! నీకు బొత్తిగా మతి లేకుండా పోతోంది. అతను యింట్లో ఉండగానే మనిద్దరం యిలా వచ్చేస్తే ఏం బాగుంటుంది? ఆఖరికి అతన్ని కూడా రమ్మని ఒకమాట కూడా అనలేదు నువ్వు.

"నాకు దాగుడు మూతలు చెప్పవు.

"సరే అయితే చివరికి పర్యవసానం కూడా ఆలో చించుకో. దానికి ముందే సిద్ధపడ్డానని నాతో చెప్తే నాకు బాధ ఉండదు. జగన్నాథం చిరాకుగా అని ఏదో నిశ్చయానికి వచ్చినట్లుగా అప్పటికి ఊరుకున్నాడు.

ఆరోజు తరువాత జగన్నాథం యింక రానని శ్యామలతో చెప్పాడు. ఆమె అప్పటికి మౌనంగా ఊరుకుంది కోపంతో.

మరో పదిహేను రోజులలో రమణమూర్తి మనసు మరింత గాయపడింది. జగన్నాథం నిజంగానే రావటం మానేసాడు. శ్యామలకి కోపం అంతారమణమూర్తివల్లనే అన్నట్లు అతని మీదికి మళ్ళింది. పలుకరించినా మాట్లాడటం కూడా మానేసింది.

ఆరోజు శ్యామల జగన్నాథం వస్తాడని ఆశగా ఎదురు చూసి చివరికి రోషంగా తను ఒంటరిగానే బయటికి వెళ్లిపోయింది. రమణమూర్తి యింటికి వచ్చేసరికి తలుపు సందులోనుంచి పోస్ట్ మాన్ పడేసిన ఉత్తరాలు ఎదురుగా కనపడ్డాయి నేలమీద.

ఒకటి శ్యామలకి వాళ్ల వాళ్లు వ్రాసింది. తీసి బల్లమీద ఎదురుగా ఉంచాడు. రెండోది కవరు, అతనిపేరనే ఉంది. విప్పి చూసాడు.

లోపల పావుటావు కాగితంలో మధ్యగా రెండు లైనులు వ్రాసి ఉన్నాయి. సంతకం, డేట స్థలం ఏమీలేవు.

"మీ భార్య ప్రవర్తన గమనించండి. అర్ధరాత్రివరకూ ఏకాంతంగా ఎవరితోనో........ రమణమూర్తి కాగితం చింపేసి ముక్కలు చేసాడు. ఒక్కసారి శరీరమంతా చెమటలు పట్టి ముద్దయి పోయింది. మనసు మొద్దు బారిపోయి ఆలోచించేశక్తి పోయినట్లనిపించింది. దోసిలిలో కాగితం ముక్కలు పొక్కి ఎగిరి పోకుండా పట్టుకున్నాడు.

ఎవరు వ్రాసారు?

ఎవరు వ్రాస్తేయేం? తను చాలా ఆలస్యంగా మత్తులోనుంచి మేల్కొన్నాడు. లోకానికి కళ్లున్నాయి. తనకి ఉన్నా చూడలేదు.

అలాగ ఎంతకాలం గడచిపోయిందో తెలియలేదు. గది చీకటిగా అయిపోయి చాలా సేపయి పోయింది. అంతా నిశబ్దంగా ఉండి గడియారం టిక్కుమనే ధ్వని మాత్రం పెద్దగా వినిపిస్తోంది.

పనిమనిషి వచ్చి గదిలో లైటు వేసే సరికి రమణమూర్తి దోసిలిలో దాచుకున్న ముఖం ఎత్తి చూసాడు.

కాగితం ముక్కలు గది అంతటా పరచుకున్నాయి.

"వాడిని వాకిచ్చి నువ్వింక యింటికి వెళ్ళు యిదిగో యీ కాగితాలు ఏరి పారేసిపో. కొడుకుని అందుకుని ఒళ్లో కూర్చొ బెట్టుకున్నాడు.

పదినిముషాల తరువాత రమణమూర్తి కొడుకు శరీరం నొప్పి పుటేంత గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు.

"అంతా తన అనుమానం. ఎవరో కిట్టనివాళ్లు వ్రాసిన ఉత్తరం అది. నిజం ఏమాత్రం ఉండి ఉండదు. శ్యామల అలా ఎప్పటికీ చెయ్యదు. తమ యిద్దరి మధ్య రెండేళ్ల వాని ఉన్నాడు. అనుకుంటూ పిచ్చిగా కొడుకు శరీరం నిండా ముద్దులు కురిపించాడు. కాని అతని మనసు సులువుగా మోసగింప బడలేదన్నట్లు నిదర్శనంగా అతనికి తెలియకుండానే వెచ్చని కన్నీరు క్రిందికి చెంపల మీదుగా జారిపోయింది.

పదిహేను రోజులు గడచి పోయాయి. జగన్నాథం మళ్లా రాలేదు. శ్యామలకి మనసులో భర్త మీద కోపం, తెలియని కసి పెరిగి పోయాయి క్రమంగా. రమణమూర్తి మనస్థితి కూడా మరింత చెడిపోయింది. మొదటి ఉత్తరం వచ్చిన పది రోజులకే మరొక కవరు చేరింది. ఎప్పటిలాగే సంతకం లేదు. మరింత వివరంగా వ్రాసారు. ఈసారి చింపకుండా దాచాడు. భార్య తనతో ఒకసారి సన్నిహితంగా మాట్లాడితే అంతా అబద్ధం అనేస్తే నిశ్చింతగా ఉండచ్చు. శ్యామల ఆ అవకాశం కూడా తనకి యివ్వడానికి యిష్టపడటం లేదు.

చివరికి ఒకరోజు శ్యామల ఉండలేక తనంతట తానే జగన్నాథం యింటికి బయలుదేరింది. రమణమూర్తి యింట్లోనే ఉన్నా భార్యని ఎక్కడికి వెళ్తున్నావని ప్రశ్నించలేదు. ఆమె వెళ్లేసరికి జగన్నాథం అప్పటికే వెళ్లిపోయినట్లున్నాడు. యిల్లు తాళం వేసి ఉంది. శ్యామలని నిరుత్సాహం ముంచేసి పిచ్చి పట్టినట్లయింది. తను వచ్చేవరకూ అక్కడే కూర్చుందామని అనుకుని మళ్లా మనసు మార్చుకుంది. అక్కడనుంచి ఒంటరిగా ఏదో సినిమా చూసేసి మళ్లీ జగన్నాథం యింటికి వెళ్ళింది అప్పుడు.

రాత్రి పదిగంటలవుతోంది మెల్లిగా. అప్పటికీ జగన్నాథం యింటికి చేరలేదు. ఆ సమయానికి మెల్లిగా ఆకాశం మబ్బు మూసేసి చిన్న వర్షం ప్రారంభించింది.

చివరికి శ్యామల చేసేది లేక రిక్షా పిల్చి యింటికి బయల్దేరింది. ఆమె మనసు తుఫానుతో అల్లకల్లోలమయిపోయిన మహాసముద్రంలా ఉంది. లోపల తెలియని కోపం, పగ యింకొక క్షణంలో గట్టు గండిపడి ఊర్లు ముంచెత్తే నదిలా పొంగి పొర్లి పోతున్నాయి.

యింటికి వచ్చేసరికి వర్షం బాగా పెద్దదయి పోయింది. వీధి గదిలో లైటు వెలుగుతోంది. కిటికీలోనుంచి రమణమూర్తి ఒకసారి చూసి తలుపు తీసాడు.

లోపలికి వచ్చేసరికి పూర్తిగా తడిసి పోయింది శ్యామల.

"జగన్నాథం కారేమయింది?" రమణమూర్తి అడిగాడు చూసి.

"లేదు. ఒకళ్ల ప్రక్కన ఒకరు దగ్గరగా కూర్చుంటే బాగుంటుందనిపించి రిక్షాలో వచ్చాము. మీ ప్రశ్నకు సమాధానం దొరికిందను కొంటాను. ఆమె విసురుగా నడుస్తూంటే చీర తడిసి తపతపా చప్పుడు చేసింది.

రమణమూర్తి భార్య తనని యింత బాహాటంగా ఎదుర్కొంటుందని అనుకోలేదు. మౌనంగా తలుపువేసేసి లోపలికి వచ్చాడు.

"యింక తనలో యీ హాలాహలం దాచుకోడం సాధ్యం కాదు. అబద్ధమయినా, నిజమయినా శ్యామలని అడిగి తేల్చుకోవాలి. అందరూ ఏమని అనుకుంటున్నారో చెప్పాలి. ఒక నిశ్చయానికి వచ్చినట్లుగా కనుబొమలు వంకరలు తిరాయి.

శ్యామల తడిబట్టలు మార్చుకుని వచ్చి తువాలుతో తల తుడుచుకుంటూ నిల్చుంది. ఎలామాట్లాడాలో తెలియక చాలాసేపు సందిగ్ధంగా ఊరుకున్నాడు.

చివరికి భార్య లైటు ఆర్పేయ బోతుండగా అన్నాడు. "ఆర్పకు. నీతో మాట్లాడాలి.

యింతవరకూ పరిస్థితి వచ్చినందుకే అతనికి చిరాకుగా ఉంది.

"మాట్లాడండి. ఆమెకూడా సిద్ధపడ్డట్లు నిర్లక్ష్యంగా కుర్చీలో కూలబడింది.

రమణమూర్తి మనసులో దావాగ్ని రగులుకుంటోంది.

"నేను నీకేమీ కానా? చివరికి అడిగాడు.

"ఎందుకు కారు? నామెడలో తాళికట్టిన భర్త అని ఎవరిన్నడిగినా చెప్తారు. నేను కాదనలేదుగా.

"అంతకుమించి మరేమీ లేదా మనిద్దరిమధ్య? నా విలువ అంతేనా?

"మీ హాస్పిటల్ రోగులకి మీరు దేవుడు. అదే మీ విలువ. శ్యామల ఒక్కొక్క మాటలో నిర్లక్ష్యం అతని మనస్సులో అగ్నికి చితుక్కుల్లా మరింత ప్రజ్వలింప చేస్తున్నాయి.

రమణమూర్తి బలవంతాన నిగ్రహించుకున్నాడు.

"నీ ప్రవర్తన మార్చుకోలేవా?"

"మరొకరు చెప్పనక్కరలేదు. అవసరమని తోస్తే నేనే మార్చుకుంటాను".

"జగన్నాథం నిన్ను శ్యాము అని ముద్దుగా పిలిస్తే నీకు తప్పుగా అనిపించటం లేదా?"

"జగన్నాథం నాకు పరాయివాడుకాదు."

శ్యామల కళ్లు జ్యోతుల్లా వెలిగాయి.

"నాకన్నా పరాయివాడుకాదా?" రమణమూర్తి సమాధానం కోసం ఆగకుండానే డ్రాయరు తెరచి తనకి వచ్చిన కవరు తీసి కోపంగా ఆమె ఒళ్లో పడేశాడు.

ఆమె ఏదో అనబోయి మానేసి కవరు విప్పింది. లోపలి కాగితం నిండా అక్షరాలు చీమల బారులా ఉన్నాయి. "మీ మంచితనం ఆధారంగా మీ భార్య విచ్చలవిడితనం భరించరానిది....." శ్యామల పూర్తిగా చదువకుండానే అంతా అర్ధం చేసుకుంది.

నిర్లక్ష్యంగా మళ్లీ కాగితం మడిచి కవరులో ఉంచి క్రింద పడేసింది. "చాలా బాగుంది. మీ మంచితనానికి మంచి సర్టిఫికెట్ యిచ్చారెవరో. కనీ యికారు యితర విషయాలలో జగన్నాథం నుంచి చాలా నేర్చుకోవాలి."

ఆమె మాట పూర్తి కాకుండానే రమణమూర్తి

చెయ్యి బలంగా చెంపమీద పడింది. శ్యామల లేచి నిల్చొక్కుకుని లోపల మళ్లా రెండో చెంపమీద కొట్టాడు. ఆక్షణంలో అతని సంస్కారపు అట్టడుగు పొరల మధ్య దాక్కున్న అసలు మానవత్వం బయటపడింది. అద్భుతంగా. తనేం చేస్తున్నాడో తనకే తెలిసేలోగా భార్యను యిష్టం వచ్చినట్లు కొట్టాడు. రెండు కాళ్లతో తన్నాడు. అంతరంగంలో నేటి ఆధునాతన సంస్కారానికి అనాగరిక మానవుడికి భేదం ఎక్కువలేదని రెండు నిముషాలలో రమణమూర్తి నిరూపించాడు. అతనిలోని అనాది పురుషుడు క్రమంగా అయిదు నిముషాల తరువాతకాని చల్లబడ లేదు.

చివరికి నీరసంగా కుర్చీలో కూర్చుని కళ్లు మూసుకున్నాడు. జరుగుతున్నదంతా కలలాగ మసకగా మనసులో ముద్ర వేసుకుంటోంది. పూర్తిగా మామూలు మనిషి అయి కనులు తెరచే సరికి శ్యామల కాళ్లదగ్గర నేలమీద ముద్దగా పడి ఉంది అస్తవ్యస్తంగా.

గొడవకి నిద్రలేచిపోయిన వాని భయంతో ఉయ్యాలలో దిక్కులెగిరి పోయేలా ఏడుస్తున్నాడు. రమణమూర్తి మెల్లిగా లేచి భార్యను చేతులలో ఎత్తుకుని శరీరానికి దగ్గరగా హత్తుకుంటూ మంచం మీద పడుకో బెట్టాడు. చన్నీళ్లతో ముఖం తడిపాడు.

అతనికి తెలియకుండానే లోపల మనసు జరిగిన దానికి బిగ్గరగా ఏడుస్తోంది.

భార్య జుట్టు సవరించి కదుముకట్టిన చెక్కిళ్లు వ్రేళ్లతో పాముతూ కూర్చున్నాడు.

పదినిముషాలకి శ్యామల కళ్లు విప్పి చూసింది.

రమణమూర్తి భార్యను రెండు చేతులతో హృదయానికి హత్తుకున్నాడు.

"నన్ను ముట్టుకోకండి". ఆమె శరీరం గొంగళి పురుగును తాకినట్లు నిలువునా వణకిపోయింది.

వదిలేసి దూరంగా కూర్చున్నాడు. వాని ఉయ్యాలలోనుంచి లేచి నిలబడి కమ్ములు

# సంస్కారానికి...

పట్టుకుని యింకా ఏడుస్తూ ఉన్నాడు.

రమణమూర్తి లేచి కొడుకుని ఎత్తుకుని తలుపు తీసి బయట నిలబడ్డాడు యిక భార్య ఎదురుగా ఉండలేక.

మళ్లీ లోపలికి వచ్చేసరికి శ్యామల అలాగే లేచి చీర సవరించుకుంటోంది. ముఖం నీళ్లతో తడి చేసుకుని తుడుచుకుంది.

అతను చూస్తూ ఉండిపోయాడు. ఆమె చిన్న సూట్‌కేసు తెరచి మంచంమీద పడేసింది. తన బట్టలు అవీ పట్టినంతవరకూ పెట్టి మూత నొక్కింది. అలమారులో పర్సు తీసుకుని సూట్‌కేస్ చేత్తో అందుకుంది.

రమణమూర్తి మాట్లాడటానికి కూడా ధైర్యం చెయ్యలేదు. ఏం జరుగబోతున్నదీ అతని మనసు ముందే గ్రహించింది. ప్రపంచం అంతా మీద పడినా పర్వాలేదన్న నిర్లక్ష్యం అతని చూపులు సంతరించుకున్నాయి.

శ్యామల ఒకసారి పొరపాటున కూడా అతని వైపు చూడకుండా నడిచింది.

ఆమె వెళ్లిపోయిన సూచనగా తలుపు గట్టిగా శబ్దం చేసిన తరువాత తలయెత్తి చుట్టూ చూసాడు.

నిజమే! శ్యామల తనని వదిలిపెట్టి, కొడుకుని కూడా విడిచి వెళ్లిపోయింది. రమణమూర్తి బాధగా తల కుర్చీ కమ్మికి కొట్టుకున్నాడు. జరిగేదంతా కలేమో అన్న ఆశతో అన్నట్లుగా. అతని చేతులలో కొడుకు ఏడ్పు అన్నింటినీ మించి జరిగేదంతా వాస్తవం అని గుర్తు చేసింది.

వాన వెలిసింది. కాని మబ్బులు పోలేదు. ఆకాశంలో అక్కడక్కడ ఒకటి రెండు నక్షత్రాలు మబ్బుల మధ్యలో మెరుస్తున్నాయి.

ఆ అర్ధరాత్రి శ్యామల ఏ విధంగా జగన్నాథం యింటివరకూ చేరిందో ఆమెకే మరుక్షణంలో గుర్తు లేదు.

తలుపు దబదబా చప్పుడయిన రెండు నిముషాలకి తలుపు తెరుచుకుంది. జగన్నాథంని స్వయంగా చూసిన తరువాత ఆమె శరీరం వివశం అయిపోయింది.

"అయిపోయింది, నేను వచ్చేసాను." చేతిలో సూట్‌కేస్ నేలమీద వదిలిపెట్టి వెక్కి వెక్కి ఏడుస్తూ అతనివైపు తూలింది. ఆమె అంత వరకూ ఏడ్వలేదు.

పడిపోకుండా జగన్నాథం గభాలున పట్టుకున్నాడు. ఆమె చేతులు నీటిలో మునిగిపోయేవాడు రక్షణ కోసం నిరాశగా వెతుక్కున్నట్లు అతని శరీరం తడిమి చుట్టూ బిగుసుకున్నాయి.

"నేను వచ్చేసాను, నన్ను తను కొట్టారు." చిన్న పిల్లలు తల్లితో అమాయకంగా చెప్పుకుని ఏడ్చినట్లుగా శ్యామల వెక్కుతోంది.

"ష! ఏమిటది? ముందు లోపలికి రా!" ఆమె చుట్టూ చెయ్యి వేసి లోపలికి నడిపించి తలుపు వేసాడు. ఏం జరిగి ఉంటుందో సులువుగా అర్థమయింది అతనికి.

"కూర్చో" ఆమె చేతులు విడిపించబోయేసరికి భయంతో మరింత దగ్గరకి జరిగింది.

"శ్యామలా! నేను భయపడుతున్నదంతా జరిగింది. నేను యిటువంటి రోజునుంచే తప్పించుకు పోవాలని ప్రయత్నించాను కాని......"

"నన్ను పొమ్మనకు" ఆమెలో బాధ అగ్ని పర్వతంలా బద్దలయి జగాలు మునిగి పోతాయనిపించింది. తనకి అతని శరీరానికి మధ్య అసలు దూరం ఉండకూడదన్నంత భయంతో అతని కంఠం చుట్టూ చేతులు బిగించి కౌగిలించుకుంది.

జగన్నాథం మనసు ఒక క్షణంలో కరిగిపోయి జాలితో నిండిపోయింది. భర్తని ఎదిరించి అర్ధరాత్రి ఒంటరిగా తనని నమ్ముకుని వచ్చిన స్త్రీని ఏమన గలడు?

"నీకిష్టమయిన చోట ఉండచ్చు. ఎవరూ నీకు అడ్డు చెప్పరు. ముందు ఏడ్పు మానేసెయ్యి చిన్న పిల్లలా." ఆమె వీపుమీద జాలిగా అరిచేతులతో రాస్తూ వూరించడానికి ప్రయత్నించాడు.

"నేనియింట్లోనే ఉంటాను ఎప్పుడూ" ఆమె యింకా ఏడుస్తూనే ఉంది.

అలాగే అప్పట్లో వోదార్పుగా చూసి సంతత జలపాతంగా ప్రవహిస్తున్న కన్నీటిని చేత్తో తుడవటానికి ప్రయత్నించాడు.

ఆమె వెక్కిళ్లమధ్య అంది "నీకిష్టం లేకపోతే నన్ను పెళ్లిచేసుకోవద్దు....కానీ.... కానీ.... నన్ను నీతోనే ఉండనీ."

ఈసారి జగన్నాథంకి ఆమె మీద జాలితోపాటు నిస్సహాయంగా ఏడ్చే పసిపిల్లలని చూస్తే కలిగే అవ్యక్తమయిన అనురాగం కలిగింది.

"నీకింతట నీకు యిష్టం లేకపోతే తప్ప ఎవరూ నిన్ను నానుంచి దూరం చెయ్యరు. యింక ఊరుకో మరి. ఎప్పుడూ అంత ధైర్యంగా మాట్లాడేదానివిగా ఏమయింది అదంతా?" అతను ఆమె శరీరాన్ని మరింత దగ్గరగా చేర్చుకున్నాడు ప్రేమతో.






ప్రతి వారము

# లండన్‌కు

# 13 సర్వీసులు

# న్యూ యార్కుకు 7

# సర్వీసులు

అన్ని సౌకర్యాలతో
కూడి సుఖకరమైన
ప్రయాణము



అంతకుమించి మరేమీ అక్కరలేదన్నట్లు ఆమె మాటాడకుండా వూరుకుంది.

జగన్నాథం కూడా యింకేమీ అడగలేదు. కొంతం విశ్రాంతిలో మనసులో ఉద్వేగం తగ్గితే తప్ప మామూలు మనిషికాదు అని వూరుకున్నాడు.

ఒక అరగంటకి ఆమె ఏడ్పు తగ్గిపోయింది కాని ఉండుండి పెద్ద వెక్కిళ్లు వచ్చి శరీరం అంతా తుఫాను తాకిడికి లేతతీగలా వణికిపోతోంది.

చివరికి యింక శక్తిలేనట్లు అతన్ని చుట్టుకున్న చేతులపట్లు సడలిపోయాయి.

శ్యామల కనురెప్పలు నీరసంతో మూతలు పడ్డాయి.

జగన్నాథం ఆమెను పొదివి పట్టుకుని మంచం దాకా నడిపించి పరిచేసి పడుకోబెట్టాడు.

"నిద్రపో, తెల్లవారేక అన్ని విషయాలు చూడవచ్చు, అంతా నీకిష్టమయినట్లే జరుగుతుంది" ఆమె ప్రక్కనే కూర్చున్నాడు.

అప్పుడుకూడా అతని చెయ్యివదలిపెట్టలేదు. శ్యామల. నిద్రలో నడిచే అలవాటున్న వాళ్ళు ఏమీ ఎరగకుండా మళ్లా సుఖంగా నిద్రపోయినంత సులువుగా రెండు నిముషాలలో మత్తుగా కళ్లు మూసుకుపోయాయి. నిద్రపట్టిన సూచనగా వూపిరి దీర్ఘంగా సాగి లయబద్ధమయింది.

ఆ రాత్రి ఆమెముఖంలోకే చూస్తూ నిద్రపోకుండా ఆలోచిస్తూ కూర్చున్నాడు జగన్నాథం.

* * *

శ్యామల యింట్లోనుంచి వెళ్లిపోయి ఆరునెలలయిపోయింది. వెళ్లిపోయిన వారంరోజుల వరకూ మళ్లా వస్తుందనే ఆశ వదులుకోలేకపోయాడు రమణమూర్తి. కాని రోజులు గడుస్తున్న కొద్దీ నిర్లిప్తత ఆవరించి మనసు మళ్లా మార్పుకి అలవాటు పడింది. మొదట్లో కొడుకుతో ఒంటరిగా యింట్లో ఉన్నప్పుడల్లా తెలియకుండా కంఠం రుద్ధమయి

# సంస్కారానికి...

పోయి అప్పుడప్పుడు ఏడ్చేవాడు ఏకాంతం భరించలేక.

కాని తరువాత రోజులలో రమణమూర్తి తెలుసుకున్నాడు ఏకాంతం, ఒంటరితనం అంత మంచి స్నేహితుడు మరొకడు లేడనే సంగతి. వాని మొదట్లో తల్లికోసం బెంగపెట్టుకున్నట్లు ఏడ్చేడు. కాని ఏమీ తెలియని వయసు కావడంచేత త్వరలో మరచిపోయాడు. వాడి సంరక్షణకోసం రాత్రి, పగలు అక్కడే ఉండేలా ఆడ మనిషిని ఏర్పాటు చేసేడు. ఆ స్త్రీ మొగుడు యింట్లో వంట, మిగిలిన పనులన్నీ చూస్తున్నాడు. వాళ్ల యిద్దరిమీద రమణమూర్తి యింటి భారం అంతా వదలిపెట్టాడు. వాళ్లు ఏమయినా కావాలంటే డబ్బు ఎంత కావాలి అని అడిగి యిస్తాడు. అంతకు మించి వాళ్లతో కూడా మాట్లాడే అవసరం అతనికి కనపడలేదు.

వారానికి నాలుగురోజులు రాత్రిళ్లు కూడా హాస్పిటల్లో కాలం గడుపుతున్నాడు. యింట్లో ఉన్నంతసేపూ మాత్రం కొడుకుని వదలి పెట్టకుండా ఎత్తుకుని త్రిప్పుతాడు. యింట్లో శ్యామలకి సంబంధించిన వస్తువులన్నీ మాయమయిపోయాయి కొద్ది రోజులలోనే. శ్యామల వెళ్లిపోయిన నాలుగునెలలకి ఆమెకి ఉన్న ఒక్క అన్నగారు ఒకరోజు అకస్మాత్తుగా వచ్చారు.

రమణమూర్తి నిజానికి ఎవరికీ తెలియపరచలేదు. అతనికి స్వంత బంధువులని ఎవరూ మిగల్లేదు. తల్లి తండ్రులు ఏనాడో గతించారు. శ్యామల బంధువులకి తనే మామూలుగా ఉత్తరాలు క్లుప్తంగా వ్రాసాడు అన్నాళ్లూ. చివరికి ఆమె అన్న గోపాలక్రిష్ణ యితరుల ద్వారా విని ఒకరోజు వచ్చేసాడు.

"నాకు వెంటనే తెలియపరచవలసింది రమణా!" గోపాలకృష్ణ విసురుగా అన్నాడు.

"ఏం చేసివుండేవాడివి?"

"కాళ్లు చేతులు విరగ్గొట్టి యింట్లో తాళం వేసేవాణ్ని" కోపంగా అన్నాడు.

"అందుకే మీకు వ్రాయలేదు".

"ఛీ! అది మనిషా, పశువా! పాలుత్రాగే పసివాడిని వదలిపెట్టేసి ఎవడితోనో....."

"బావా!" రమణమూర్తి మధ్యలోనే ఆపేశాడు. "నేను మరచిపోదామని ప్రయత్నిస్తున్నాను. నన్నింకా బాధ పెట్టకు."

"అంతా నీ మెతకతనం రమణా! మొదట్లో వాళ్లిద్దరూ రాత్రి పగలు అనక వూరుపట్టుకు తిరుగుతూ ఉంటే చూస్తూ వూరుకున్నావట. నాకు తెలిసిన వాళ్ళందరూ చెప్పారు."

రమణమూర్తి జవాబు చెప్పడానికి ప్రయత్నించలేదు.

"ఆడదాన్ని కొంతవరకూ అవసరమయితే అదుపులో ఉంచాలి. యిప్పుడు చూడు నీ విశాలహృదయం యింకా విశాలమై, నిర్మానుష్యం, బీడు అయిపోయింది" గోపాలకృష్ణ కొంతవరకూ అతని చేతకానితనం కారణమని వెటకారంగా అన్నాడు.

"అంతా అయిపోయింది. యిప్పుడెందు కవన్నీ" రమణమూర్తికి అప్పుడుకూడా కోపం రాలేదు.

గోపాలకృష్ణకు వెంటనే జాలి వేసింది.

"ఈ వూళ్లోనే వున్నారుటా?" అడిగాడు కొంచెం సేపుండి.

"నాకు తెలియదు."

"ఆ మనిషి పేరేమిటి? ఎక్కడుంటాడు ?"

రమణమూర్తి మాట్లాడటానికి యిష్టంలేనట్లు తలవూపి అక్కడనుంచి లేచి వెళ్లిపోయాడు.

కాని గోపాలకృష్ణ అంతటితో వూరుకోలేదు! చుట్టుప్రక్కల వారిని అడిగి యింకా యితర వివరాలను పట్టుకుని అక్కడున్న రెండురోజులలో చివరికి సాధించి జగన్నాథం ఎడ్రసు సంపాదించాడు.

నేరుగా రమణమూర్తికి తెలియకుండా బయలుదేరి వెళ్లాడు. అన్నగారిని చూసి అవాక్కయిపోయింది శ్యామల.

జగన్నాథం యింట్లో లేడు ఆ సమయంలో. గోపాలకృష్ణ నోటికివచ్చినట్లు తిట్టాడు చాలాసేపు. ఆమెను చెల్లెలని చెప్పుకోడం కంటే చావడం నయమన్నాడు. నువ్వు చచ్చిపోతే, శవం ఎవ్వరూ తగలెయ్యరు, కుక్కలు పీక్కుతింటాయి అన్నాడు.

అంతసేపూ శ్యామల ప్రాణం లేని రాతి బొమ్మలా నిలబడింది. జవాబు చెప్పడానికి గాని, సమర్థించుకోటానికిగాని ప్రయత్నించ లేదు. సిగ్గుపడి తలదించుకోనూ లేదు. భయపడి తనని కానట్లుగా ఏదో వింతగా చూస్తున్నట్లుగా గుడ్లప్పగించి చూస్తూ నిలబడిపోయింది.

ఆమెను అలాచూసి గోపాలకృష్ణ మరింత రెచ్చిపోయాడు కోపంతో. అప్పటికి జగన్నాథం బయటనుంచి యింటికి తిరిగి వచ్చాడు. పరిస్థితి కళ్ల ఎదురుగానే ఉంది.

"నువ్వేనా జగన్నాథం ?" గోపాలకృష్ణ చూస్తూనే కాళరుద్రుడయిపోయాడు.

"శ్యామలా! నువ్వులోపలికి వెళ్లు" పట్టించుకో



నట్లు అని అతనివైపు తిరిగాడు జగన్నాథం.

"మీరెవరో నాకు తెలియదు దయచేసి యిక్కడ నుంచి వెళ్లిపోండి.'

"నువ్వెవరు నాకు చెప్పడానికి? అది నా చెల్లెలు" అక్కడే నిలబడి ఉండిపోయిన శ్యామల వంక జుగుప్సగా చూస్తూ అన్నాడు.

"మీ ప్రేమకి సంతోషం. మీరు ప్రస్తుతం నా యింట్లో ఉన్నారు. గొడవ పెట్టకుండా వెళ్లిపోండి" జగన్నాథం కూడా కోపంగా అన్నాడు.

"ఛీ! సిగ్గులేని బ్రతుకులు" గోపాలకృష్ణ చీదరించుకుని గిరుక్కున వెనక్కి తిరిగిపోయాడు.

జగన్నాథం శ్యామల ఏడుస్తుందనుకున్నాడు వెంటనే

"నేను చచ్చిపోతే ఎవరూ తగలెయ్యరుట" ఆమె అంటూ నవ్వింది మెల్లిగా. ఆ నవ్వులో బాధ ఉందో నిర్లక్ష్యం ఉందో అతనికి అర్థం కాలేదు.

"అవన్నీ మనసులో ఉంచుకోకు" శ్యామలని పట్టుకుని లోపలికి నడిచాడు జగన్నాథం.

గోపాలకృష్ణ యింటికి వచ్చేసి రమణమూర్తితో పోలీస్ రిపోర్టు యిమ్మన్నాడు.

"నీకు మతిపోయిందేమిటి బావా! శ్యామల చిన్నపిల్ల కాదు. అయినా ఏమి సాధిద్దామని అనుకుంటున్నావు?" రమణమూర్తి తీవ్రంగా నిరసించేసరికి పూరుకున్నాడు.

"నానిగాడిని నాతో తీసుకు వెళ్తాను. నువ్వు చూడటం కష్టం. ఈవయసులో వాడికి ఆడ దక్షత కావాలి" వెళ్లిపోయేముందు గోపాలకృష్ణ అడిగాడు.

"వద్దు, వాడికి యిప్పటికే తల్లిలేదు. తండ్రి ప్రేమకూడా దూరం చేయకు వాడు చేయని నేరానికి" రమణమూర్తి స్థిరంగా అన్నాడు.

గోపాలకృష్ణ సందేహిస్తూనే చివరికి చేసేదేమీ లేక వెళ్లిపోయాడు.

*  *  *

తను ఏం ఆశించి వచ్చిందో శ్యామలకి ఎన్ని రోజులయినా తెలియలేదు. కాని ఆ ప్రయత్నంలో ఎంత పోగొట్టుకున్నదీ త్వరలోనే తెలిసిపోయింది.

"నానిని యిక్కడికి తీసుకువస్తే నీకు అభ్యంతరమేమయినా ఉంటుందా?" సందేహిస్తూనే చివరికి అడిగేసింది.

"అటువంటిదేమీలేదు. నువ్వింకా సంతోషంగా ఉంటానంటే అంతకంటే ఏం కావాలి?" జగన్నాథం ప్రసన్నంగా అన్నాడు.

"తను అందుకు ఒప్పుకుంటారా?" నమ్మకం లేనట్లు అధైర్యంగా అడిగింది.

"ఏమో చెప్పలేము" ఆగి అన్నాడు. "శ్యామూ! ఎన్నాళ్లిలా విడిగా ఉంటాం?"

జగన్నాథం ఆమెతో ఒక్కసారి పొరపాటున కూడా తప్పుచేసావనికాని, అలా చేసి ఉండకూడదనే భావంకాని తన మాటలలో రాకుండా జాగ్రత్త పడ్డాడు. ఆమె మనసు గాయపడి ఉంది. దానికి కారణం ఆమే కావచ్చు, పరిస్థితులు మరెవరయినా సరే ముందు ఆ గాయం మాన్పడానికి ప్రయత్నించాలి అని నిశ్చయం చేసుకున్నాడు. ఆమె ఎంత ప్రయత్నం చేసినా ప్రస్తుతం సంతోషంగా లేదని జగన్నాథంకి అర్థమవు

# సంస్కారానికి...

…పోతే ఉంది.

"యిప్పటికే నీకు యిష్టం లేకుండానే నీ యిల్లు ఆక్రమించాను. యింకేమీ వద్దు" ఆమె మాటలలో బాధ అర్థం చేసుకుని జగన్నాథం లేచి దగ్గరగా వచ్చాడు.

"నేను మనస్ఫూర్తిగా అడుగుతున్నాను.

"నీకు వివాహంలో నమ్మకం లేదని నాకు తెలుసు

"నేను నిన్ను ఒంటరిగా ఉండనీయను" జగన్నాథం జవాబు చెప్పకుండా ఆమె చెయ్యి తన చేతులమధ్య తీసుకుని అన్నాడు.

శ్యామల మౌనంగా పూరుకుంది.

మరొక రోజు అడిగింది. "వానిని పంపడానికి తను ఒప్పుకోరంటావా?"

"నేను మరచి పోలేదు శ్యామలా, అదే ఆలో చిస్తున్నాను." జగన్నాథం అన్నాడు.

"ఒక వేళ ఒప్పుకోక పోతే మనం ఏమీ చెయ్య లేమా?" నిరాశగా అడిగింది.

"చెయ్యెచ్చు. దానికి కష్టం లేదు. కాని మరి మీకు యింకా విడిపోయినట్టు ఏమీ లేదు కదా." ఆగి అన్నాడు. "నన్ను ప్రయత్నించమంటావా?"

అతని ఉద్దేశ్యం ఆమెకి వెంటనే అర్థ మయింది. "వద్దులే. తనకిష్టం లేకపోతే అంతా గొడవయి పోతుందేమో. నేనిలాగే ఉంటాను అవసరమయితే".

"ఎప్పటికయినా తప్పదుకదా! మరి కాని కావా లంటున్నావు." యింతవరకూ వచ్చిన తరువాత ఆమె ఎందుకు అడ్డు పెడ్తోందో జగన్నాథంకి అర్థం కాలేదు.

"పూరికే అన్నాను. వాడు ఎక్కడున్నా పర్వాలేదు నాకు" శ్యామల చూపులు తప్పించేసి అక్కడ నుంచి వెళ్ళిపోయింది.

* * *

రమణమూర్తి జీవితం అస్తవ్యస్తమయి పోయింది. ఒకప్పుడు అతనికి పరమార్థ్యమని అనుకున్న హాస్పిటల్ కి సరిగా వెళ్ళటం మానే సాడు. రెండు నెలల సెలవు పెట్టి అయి పోయిన తరువాత మళ్ళీ పొడిగించమని కోరాడు కాని దానికి పైవాళ్ళు అంగీకరించలేదు. అతనికి మనుష్యుల నీడ చూస్తే కూడా భయంగా ఉంది. వీధిలోకి అడుగు పెట్టడం మానేసాడు. తెలిసిన వాళ్ళని కూడా తప్పించుకుని తిరగ గలిగితే బాగుండుననిపిస్తోంది. ఎవరిని చూసినా తన గురించే గుసగుసలాడుతున్నట్లు బాధ పడు తున్నాడు. అందరి దృష్టిలో తను చాతకాని వాడు.

అతనికి క్రమంగా పరిసరాల మీద ఆసక్తి పోయింది ఒక్క తన కొడుకు తప్ప. వాడు మెల కువగా ఉంటే ఎత్తుకుని త్రిప్పుతాడు. నిద్ర పోతే తనుకూడా ప్రక్కనే చెయివేసి పడు కుంటాడు. అతనికి స్నానం చేయాలి, భోజనం చేయాలి అని మరొకరు గుర్తు చేస్తే తప్ప తెలియటం లేదు.

రమణమూర్తి నివసించే ప్రపంచం బాగా చిన్నదయిపోయింది. అదికూడా పూర్తిగా నచ్చ టం లేదు. గొంగళిపురుగులాగ గూడుగట్టుకుని లోపల ఏం జరుగుతున్నదీ ప్రపంచానికి తెలియ కుండా తనొక్కడే కాలం గడిపే జీవితం మంచి దనే నిశ్చయానికి వచ్చాడు. హాస్పిటల్ కి యధా లాపంగా పోయి వస్తున్నాడు. యాంత్రికంగా తన వృత్తి ధర్మం నెరవేరుస్తున్నాడు.

చివరికి ఒకరోజు ఒకకేసు ఆపరేషనుకి వచ్చింది. రమణమూర్తికి చెయ్యడం యిష్టం లేదు. మిగిలిన వాటిలాగ అలవాటుగా చెయ్య గలిగింది కాదు. ప్రత్యేకమయిన ఏకాగ్రత అవసరం. తనపరిస్థితిలో అది సాధ్యం కాదని తాను చెయ్యలేనని చెప్పేసాడు. కాని యితర సర్జన్లు ఎవరూ ముందుకి రాలేదు. అంతకుముందు అటువంటివి రెండుమూడు సార్లు అతనే చేయ డంచేత చివరికి రమణమూర్తికి తప్పనిసరి అయిపోయింది.

అతనికి మధ్యలోనే తెలిసి పోయింది తను ఆప రేషను సక్రమ్ చేయలేడని. మనసు నిలబడటం లేదు. ఏదో మొదలు పెట్టినందుకు పూర్తిచేయా ల్సిన బాధ్యత ఉందన్నట్లు చేసేసాడు. ఆ సమ యంలో పేషంటు జీవన్మరణ సమస్య, విలువ ఏ మాత్రం ఆలోచించలేదు. చివరికి ఏదేదో తనకి తోచినట్లు పూర్తి చేసాడు. పేషంటు ఆపరేషను టేబిలు మీద మధ్యలోనే మరణిం చాడు. పేషంటు బంధువులలో ఒక డాక్టరు ఆపరేషను జరుగుతూండగా ప్రక్కనే ఉండి చూసాడు.

వారం రోజులలో పరమణమూర్తి మీద కేసు పడింది తను సరిగా చేయవలసిన పద్ధతిలో చేయలేదని, కేవలం అతని నిర్లక్ష్యం వల్లనే రోగి మరణించటం జరిగిందని ఆరోపించ బడింది. రమణమూర్తి ఆశ్చర్యపడలేదు. బాధ పడలేదు. అతనికి తెలుసు తన నిర్లక్ష్యం వల్లనే ప్రాణహాని జరిగిందని. ఎంతో పేరున్న అతని మీదే యిటు వంటిది రావటం మిగిలిన డాక్టర్లకే ఆశ్చర్యం కలిగింది. వాళ్ళు సహాయం చేస్తామన్నా వినకుండా తన పక్షం లాయరుని కూడా సంప్రతించ లేదు. పరిస్థితులు ఎటు దారితీస్తే ఆ విధంగానే నడచు కోడం శ్రేయస్కరం అని నిర్ణయించాడు.

అతని దగ్గర మిత్రులు మాత్రం పూరుకోలేక పోయారు. కేసు కోర్టుకి వెళ్తే అనవసరమయిన ప్రశ్నలన్నీ వస్తాయి. అతని పరిస్థితి, భార్య గురించి వివరాలు బైటికి వస్తే యింకా బాధపడ్తాడని వాళ్ళే అవతలి వారి దగ్గరకి మధ్యవర్తులుగా వెళ్ళి ఏ పరి

---

**డాక్టర్ కబుర్లు**

కాన్సర్ కి పని చేసే కొత్త ఆంటీబయోటిక్ మందు ఒకటి కనిపెట్టారుట! వ్రణంతో బాధ పడుతున్న 78 మందికి ఈ



మందు వాడగా 32 మంది బాగా కోలుకున్నారుట. పడకవేసిన ఒక పేషంటు లేచి తిరిగాడుట.

దీనిని కనిపెట్టిన మనిషిపేరు డా॥ మోసెస్ వెండ్లర్. ఆయన సూక్ష్మ క్రిముల విషయం లోనూ, యూదుల ధర్మశాస్త్రాల విషయంలోనూ కూడా చాలా గట్టివాడు. హెర్మాన్ వూక్ అనే యూద రచయిత పుస్తకం రాస్తూ ఉంటే సహాయపడేకాలంలో గాడిదల మలవిసర్జన పదార్థాలని సేకరించి అనుశీలించాడు. ఈ కొత్త ఆంటీబయాటిక్ ని తయారుచేసే క్రిములని వేరు చేశాడు.

అన్నిరకాల కాన్సర్ వ్యాధులూ దీనికి లొంగవు. కాని, వ్రణాలు తగ్గి, రోగులు బలంకోలుకుంటూ ఉంటే కాన్సర్ చికిత్స మానవ సాధ్యం అనుకున్నా తప్పులేదు.

హెచ్. ఎల్. హార్వెన్‌సన్

(కాపీరయిటు)

స్థితిలో అలా జరిగిందో నచ్చ చెప్పి ఒప్పించారు. చివరకి కోర్టుకి పోవక్కర లేకుండా నష్టపరిహారం కొంత యిచ్చే ఏర్పాటు జరిగింది.

రమణమూర్తి యీ దెబ్బనుంచి కోలుకునే లోగా మరొక సంఘటన జరిగింది. ఒక రోజు అతను వెళ్తూ ఉంటే హాస్పిటల్ బోటీ ఒకడు ప్రక్కవాడితో, యీయన భార్య లేచిపోయింది, ఈయన పాపం కొడుకునెట్టుకుని ఒక్కడే ఉంటు న్నాడని చెప్తూండగా ఆ మాటలు అతని చెవిలో పడ్డాయి.

ఆ మనిషిని వెంటనే తన గదిలోకి పిల్చి తిట్టాడు. వాడు భయపడి తనేమీ అనలేదన్నాడు. ఆ పైన రమణమూర్తికి ఒళ్లు మండి వాడిని చెంపమీద కొట్టాడు. ఆ నిప్పు నిముషాలలో అంతటా అలుము కుని మరొక గంటలో హాస్పిటల్లో ఉన్న బోటీ వాళ్లందరూ పనులు వదిలిపెట్టి బయటకి వచ్చే సారు నిరసనగా.

ఎప్పుడూ శాంతంగా ఉండే రమణమూర్తి అటు వంటి పని చేసాడంటే అందరికీ ఆశ్చర్యమే కలి గింది. సమ్మె రెండు రోజులు జరిగిన తరువాత రమణమూర్తి ఆలోచించి వాళ్లు కోరినట్లు ఉద్యోగం రిజైన్ చేసాడు. ఆ క్షణం కోసమే తను ఎదురు చూస్తున్నట్లుగా హాస్పిటల్లో అందరికీ నవ్వుతూ వీడ్కోలు చెప్పి యింటికి వచ్చేసాడు. అప్పటికి మనసులో కోపం తీరి కొంచెం సంతృప్తి కలిగింది.

రెండు రోజులు ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చేసాడు. వీళ్లందరికి సాధ్యమయినంత దూరంగా వెళ్లిపోవాలి. అదే అతని కోరిక. వీలయితే ఎక్క డయినా ఉద్యోగం సంపాదించి దేశం విడిచి కూడా వెళ్లిపోవాలని అనిపించింది. అతనికి ఉన్నది ఫారిన్ డిగ్రీయే కాబట్టి అది అంత కష్టం కాదు. కాని మళ్లీ కొడుకు భవిష్యత్తు దృష్టిలో ఉంచు కుని ఆ ప్రయత్నం విరమించాడు.

ఒక రోజు రాత్రికి రాత్రి యిల్లు వదిలిపెట్టి ఎవరికీ తెలియని మారుమూల పల్లెటూరు వెళ్లి పోయాడు. అతను ఎక్కడికి వెళ్లాడో ఏమిటో ఎవరికీ తెలియలేదు. అతను స్థిరపడిన వూరికి బస్సు మార్గమే కాని రైళ్లు లేవు. మొదటిసారి కొడుకు నెత్తుకుని ఆ వూరు నేలమీద అడుగు పెట్టి చాలా సంతోషించాడు. అందరూ క్రొత్త వాళ్లే. తన నెవరూ ఎరగరు. రమణమూర్తి ఉద్యో గం చేయకపోయినా అతనికున్న ఆస్తి, డబ్బు రెండు తరాలకి సరిపోతుంది. నెల రోజులలో ఆ వూళ్లోనే తనకి సరిపోయే విశాలమయిన యిల్లు కట్టించు కున్నాడు. చుట్టు ప్రక్కల వాటిమీద దాబుగా ఉండకుండా జాగ్రత్తపడి, యింట్లో వంటకి, పనికి నమ్మకమైన మనిషిని కుదుర్చుకున్నాడు. క్రొత్తలో అతను డాక్టరని తెలిసి చుట్టు ప్రక్కల వాళ్లు సహాయంకోసం వచ్చారు. రమణమూర్తి తను ఏమి చెయ్యలేనని చెప్పేసాడు. సాధ్యమయినంత సాధారణమయిన జీవితం గడపాలని అతని కోరిక. కాని ఒకటి రెండుసార్లు చావు బ్రతుకుల మధ్య నున్న కేసులు వచ్చినప్పుడు మాత్రం అతనిలోని మానవత్వం నిరాకరించలేక పోయింది. అప్పటికి తనకి చేతనయిన సహాయం చేసి మళ్లీ తన దగ్గరికి తీసుకురావద్దని చెప్పాడు.

మరొక నెల రోజులలో రమణమూర్తికి ఆ వాతావరణం, పరిసరాలు అలవాటు అవడమే కాక విడువలేనంత సన్నిహితంగా అయిపోయాయి.

(ముగింపు వైశాఖం)

# మీరు పుట్టిన ఇంగ్లీషు తేదీని అనుసరించి మీ స్వభావం? మీ మిత్రులు?

## తుల:

ఇది రాసులలో యేడవది. ప్రతి సంవత్సరం సెప్టెంబరు 23వ తేది నుండి అక్టోబరు 22వ తేదీవరకు సాయనసూర్యుడు తులారాశియందు ఉంటాడు కాబట్టి యీ తేదీల మధ్యను పుట్టిన వారు తులా రాశియందు జన్మించిన వారుగా పరిగణింపబడుతున్నారు. ఏ సంవత్సరంలోనైనాసరే యీ తేదీల మధ్యను పుట్టినవారికి తులారాశి ఫలితాలే వర్తిస్తాయి. దీనికి జననకాలంతోగాని జన్మనక్షత్రంతో గాని నిమిత్తం లేదు.

ఈ రాశి ప్రారంభంలో అనగా సెప్టెంబరు 23—26 తేదీల మధ్యను జన్మించినవారి మీద అంతకుముందు ఉన్న కన్యారాశి ప్రభావం కూడా ఉంటుంది. అలాగే రాశి ఆఖరున అనగా అక్టోబరు 19—22 తేదీల మధ్యను జన్మించిన వారిమీద రాబోయే వృశ్చికరాశి ప్రభావం కూడా ఉంటుంది.

తుల అనగా త్రాసు. ఇది చరరాసి. వాయువుకు సంబంధించిన రాసులలో యిది రెండవది. సంగీత సాహిత్యాది కళలకు కారకుడైన శుక్రుడు యీ రాసికి అధిపతి.

ఈ రాశియందు జన్మించిన వారు సాధారణంగా ఆలోచనాపరులై ఉంటారు. ప్రతివ్యవహారంలోను అందులోని మంచి చెడ్డలను గురించి వీరు ముందు గానే ఆలోచిస్తుంటారు.

అందరకూ న్యాయం జరగాలని వీరు కోరుతుంటారు. వీరు యే నిర్ణయం చేసినా, దానివలన యితరులకు అన్యాయం జరగకుండా చూస్తూ ఉంటారు. ఒక్కొక్కప్పుడు వీరి నిర్ణయం వలన వీరికి నష్టం కలిగినా కూడా పట్టించుకొనరు.

అందరితోను వీరు సన్నిహితంగా ఉంటారు. వీరు నిష్పక్షపాతంగా వ్యవహరించడం వలన శత్రువులు కూడా వీరి అభిప్రాయాలను గౌరవిస్తారు. వీరు ముక్కుకుసూటిగా పోయేవారు కావడం వలన తాము చేసే పనివలన తమకు కలగబోయే నష్టాన్ని గురించి కూడా ఆలోచించరు. వీరు చేసే నిర్ణయాలవలన ఆకస్మికంగా శత్రువులు మిత్రులుగాను, మిత్రులు శత్రువులుగాను కూడా మారుతుంటారు.

వీరు యెప్పుడూ కష్టపడి పని చేస్తుంటారు. అపరిచితులతో కూడా వీరు అల్పకాలంలోనే సన్నిహితులు కాగలరు. వీరికి సాధారణంగా కోపం రాదు. కాని యితరులు తమ యెడల దురుద్దేశంతో వ్యవహరిస్తున్నారని వీరు గ్రహించినప్పుడు పగబట్టే ప్రమాదం ఉంది.

వీరు [illegible] బలంతో యెదుటివారిని తమకు అనుకూలంగా చేసికొనగలరు. ప్రతివిషయాన్ని వీరు తర్కంతో పరిశీలిస్తుంటారు కాబట్టి వీరిని యితరులు మోసం చేయడం కష్టం. ప్రతి విషయమూ క్రమబద్ధంగా ఉండాలని వీరు కోరుతుంటారు.

తమకు యెటువంటి కష్టం కలిగినా, దానిని వీరు వెలిబుచ్చరు. ఏ విషయాన్నైనా వీరు దీర్ఘంగా ఆలోచిస్తుండడంవలన, వీరు త్వరగా ఒక నిర్ణయానికి రాలేరని యితరులు అనుకొంటారు.

## ద్రేక్కాణ ఫలం

తులారాశిలో మొదటి ద్రేక్కాణానికి (సెప్టెంబరు 23—అక్టోబరు 2) చంద్రుడు అధిపతి. ఈ సమయంలో పుట్టిన వారు యెప్పుడూ యేదో ఒక దానిని గురించి ఆలోచిస్తూనే ఉంటారు. సమయానికి వీరికి స్థిరనిశ్చయం లేకపోవడం వలన జీవితంలో కొన్ని అవకాశాలను కోల్పోతారు. వీరు తెలివిగలవారు అయినప్పటికీ తమ జీవితంలో వీరు తెలివికంటె తమ యిష్టానికి ప్రాధాన్యతను యిస్తుంటారు. వీరు మితిమీరిన ఖర్చును చేస్తుంటారు. కొంతమంది మిత్రులే వీరిని మోసం చేయగల ప్రమాదం ఉంది. తమ అభిరుచిని వీరు త్వరలోనే మార్చుకొనగలరు. సంఘసేవ, సాహిత్య కళారంగాలు, శృంగారం వీరి అభిమాన విషయాలు.

రెండవ ద్రేక్కాణానికి(అక్టోబరు 3—12తేదీల మధ్యకాలం) శని అధిపతి. ఈ సమయంలో పుట్టిన వారు జీవితంలో చాలా కష్టాలను యెదుర్కోవలసి ఉంటుంది కాని చివరకు విజయాన్ని సాధించగలరు. వీరు యెల్లప్పుడూ ముక్కుకుసూటిగా పోవాలని కోరుతుంటారు. తమ మిత్రుల యెడల వీరు విశేషమైన అభిమానాన్ని చూపిస్తారు. జీవితంలో వీరు చాలా ఒడుదుడుకులకు గురి కాగలరు. కాని వీరి ఆత్మవిశ్వాసమే వీరిని రక్షించగలదు. ఎటి పరిస్థితిలోను వీరు తమ పట్టుదలను, విడిచి పెట్టడానికి అంగీకరించరు. పరిశ్రమలు సంఘసేవమాత్రం వీరి అభిమాన విషయాలు.

మూడవ ద్రేక్కాణానికి (అక్టోబరు 13—22 తేదీల మధ్యకాలం) గురుడు అధిపతి. ఈ సమయంలో పుట్టినవారు పరిస్థితులకు అనుగుణంగా నడుచుకొనే నేర్పుకలవారు కాబట్టి జీవితంలో సులభంగా విజయాన్ని సాధించగలరు. వీరు అన్ని వ్యవహారాల్లోను ఉదారంగా ఉంటారు. వీరు త్వరగా సరియైన నిర్ణయానికి రాగలరు కాబట్టి సామాన్యమైన విషయాన్నుంచి కూడా విశేషమైన ఫలితాన్ని పొందగలరు. తరుచు దూర ప్రయాణాలు చేస్తుంటారు. త్వరలోనే ధనవంతులు కాగలరు. కుటుంబ సౌఖ్యం బాగా ఉంటుంది. న్యాయశాస్త్రం, రాజకీయాలు, చరిత్ర వీనిలో రాణిస్తారు.

సూచన:— మొదట చెప్పబడిన రాశి ఫలితానికీ తరువాత చెప్పబడిన ద్రేక్కాణ ఫలితానికి, తేడా ఉన్నప్పుడు ద్రేక్కాణ ఫలితాన్ని గమనించాలి. ద్రేక్కాణ ఫలితమే సరిగ్గా సరిపోతున్నట్లు చాలా మంది అభిప్రాయం.

## తులారాశియందు జన్మించిన భర్తతో వ్యవహరించడం యెలాగ?

భార్య జీవితంలో భాగస్వామిని అని వీరి అభిప్రాయం. అందుచేత భార్యకూడా వీరితో సమాన స్థాయిలోనే వ్యవహరించడం మంచిది. వీరు అన్నివిషయాలను గురించి పట్టించుకొనరు కాబట్టి చిన్న చిన్న విషయాలను గురించి వీరితో చెప్పడం వలన వీరికి విసుగు కలుగుతుంది. తరుచుగా వీరు ఆలోచనలోనే ఉంటారు కాబట్టి భార్య చురుకుగా వ్యవహరించడం అవసరం. పొగడ్తల ద్వారా వీరిని, తనకు అనుకూలంగా భార్య మలచుకొనవచ్చును.

## తులారాశియందు జన్మించిన భార్యతో వ్యవహరించడం యెలాగ?

ఈమె తెలివికలది అయినప్పటికీ, ఆత్మవిశ్వాసం తక్కువగా ఉంటుంది కాబట్టి భర్త దానికి తగినట్లుగా ధైర్యాన్ని కలిగించడం అవసరం. ఈమెకు జ్ఞాపకశక్తి అధికంగా ఉంటుంది. ఇతరులు తనను గురించి చెప్పినమాటలను యెప్పటికీ మరచిపోదు. కాబట్టి కోపంలోనైనాసరే యీమెను విమర్శించకూడదు. భర్త తనకు యజమానిగా కాకుండా స్నేహితునిగా ఉండడాన్నే యీమె వాంఛిస్తుంది. విలాసయాత్రలమీద యీమెకు సరదా ఉంటుంది.

## తులారాశియందు జన్మించినవారికి మిత్రులు యెవరు?

తులారాశియందు జన్మించిన మిత్రులును వీరును ఒకే స్వభావాన్ని కలిగి ఉంటారు. కాబట్టి వీరి స్నేహం చాలాకాలం ఉంటుంది. వీరి మధ్యను భేదాభిప్రాయాలు ఉండకపోవచ్చును. కాని ఒకరు చెప్పిన దానిని యింకొకరు వెంటనే అంగీకరించడం వలన వీరి మైత్రి ఉత్సాహకరంగా ఉండకపోవచ్చును.

తులారాశియందు జన్మించిన వారికి, వృశ్చికరాశి (అక్టోబరు 23—నవంబరు21) యందు జన్మించిన వారికి మైత్రి అరుదుగా ఉంటుంది. తులారాశివారి ఆలోచనలు వృశ్చిక రాశివారు గౌరవిస్తారు. వృశ్చిక రాశివారి ఉదారస్వభావాన్ని తులా రాశివారు మెచ్చుకొంటారు. కాని వీరి మధ్యను సన్నిహితమైన సంబంధం ఉండకపోవచ్చును. వీరిద్దరూ కలసి హృదయపూర్వకంగా కృషిచేసిన యెడల యెటువంటి పనినైనా సాధించగలరు.

తులారాశియందు జన్మించిన వారికి, ధనూరాశి (నవంబరు 22 --డిశంబరు 21) యందు జన్మించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. వీరు ఇద్దరూ ప్రతి విషయాన్ని గురించి చర్చిస్తుంటారు. ధనూరాశివారు అన్ని విషయాల్లోను సాహసంగా వ్యవహరిస్తారు. తులా రాశివారు ప్రతివిషయాన్ని గురించి బాగా ఆలోచిస్తారు. అందుచేత వీరిమైత్రి ఉభయ ప్రయోజనకరంగా ఉంటుంది. వీరిలో ఒకరు మితిమీరి ప్రవర్తిస్తే వీరిమైత్రికి ఆకస్మికంగా భంగం కలుగుతుంది. తరువాత ఒకరికొకరు ప్రబల శత్రువులుగా మారే అవకాశం కూడా ఉంది.

తులారాశియందు జన్మించినవారికి, మకరరాశి (డిశంబరు 22— జనవరి 20)యందు జన్మించిన వారికి మైత్రి సాధారణంగా ఉంటుంది. మకరరాశి వారు ఏదో ఒకవిధంగా తమ పనుల్ని నెరవేర్చుకొనడానికి ప్రయత్నిస్తారు. అది తులారాశివారికి నచ్చదు. తులారాశివారికి ఆలోచనలు అధికంగా ఉంటాయి. అది మకరరాశివారికి నచ్చదు. వీరు యిద్దరూ వ్యాపారంలో భాగస్వాములు అయినయెడల అది ఉభయ ప్రయోజనకరంగా ఉంటుంది. వీరి మైత్రివలన యిద్దరకూ మేలు కలుగుతుంది. వీరితో తులారాశి వారు నిగ్రహంతో వ్యవహరించడం అవసరం.

తులారాశియందు జన్మించినవారికి, కుంభరాశి (జనవరి 1— ఫిబ్రవరి 19) యందు జన్మించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. వీరు యిరువురి స్వభావాల్లోను పోలికలు చాలా ఉంటాయి. ఇద్దరూ ఆలోచనా పరులే. ఇతరులకు ఉపకారం చేయడంలో యిద్దరికీ ఆసక్తి ఉంటుంది. కాని ఆచరణలో భేదం ఉంటుంది. తులారాశివారికి న్యాయంమీద పట్టుదల ఉంటుంది. కుంభరాశివారికి యితరులమీద, దయ అధికంగా ఉంటుంది. అందుచేత ఒకరినొకరు గౌరవించుకొంటారు. కారణాంతరాలవలన వీరు విడిపోయినా, ఒకరిమీద ఒకరికి ఉండే గౌరవానికి లోపం ఉండదు.

తులారాశియందు జన్మించిన వారికి మీనరాశి (ఫిబ్రవరి 20— మార్చి 21) యందు జన్మించిన వారికి మైత్రి అరుదుగా ఉంటుంది. వీరి స్వభావాల్లో చాలా భేదం ఉంటుంది. కాని ఆ భేదమే ఒక్కొక్కప్పుడు వీరి మధ్యను ఆకర్షణను కలిగించవచ్చును. తులా రాశివారు యెప్పుడూ ఆలోచనలో మునిగి ఉండడం మీనరాశివారికి సహించదు. మీనరాశివారు ప్రతి విషయంలోను ప్రతిఫలాన్ని కోరుతుంటారు. అది తులారాశి వారికి సహించదు. బలవత్తరమైన కారణాలవలన వీరు సన్నిహితులు అయినా వీరిమైత్రి హృదయపూర్వకంగా ఉండదు.

తులారాశియందు జన్మించినవారికి మేషరాశి (మార్చి 22 — ఏప్రిల్ 20) యందు జన్మించిన వారికి సహజమైన మైత్రి ఉంటుంది. మేషరాశి

వారి చురుకుతనానికి తులారాశివారు తమ లోక జ్ఞానాన్ని జోడించి తమ పనులను సాధించుకొన గలరు. వీరు యిద్దరూ కలసి హృదయపూర్వకంగా ప్రయత్నించిన యెటువంటి పనినైనా సాధించగలరు. తులారాశివారి ఆలోచనలను మేషరాశివారు అమలు జరిపి విజయాన్ని సాధిస్తుంటారు. కాని వీరు యిరువురి మధ్యను యితరుల మూలంగా భేదాభిప్రాయాలు రావడానికి చాలా అవకాశాలు ఉన్నాయి.

తులారాశియందు జన్మించిన వారికి వృషభరాశి (ఏప్రిల్ 21— మే 21) యందు జన్మించిన వారికి మధ్యను విచిత్రమైన సంబంధం ఉంటుంది. మామూలుగా వీరు ఒకరినొకరు విమర్శించుకొంటూ ఉంటారు కాని అవసరము వచ్చినప్పుడు ఒకటి కాగలరు. తులారాశివారికి గల చాకచక్యం, ఆలోచన వృషభరాశి వారియందు సాధరణంగా లోపిస్తాయి. అందుచేత వృషభరాశివారు తులారాశి వారిని అనుసరించడం వలన ప్రయోజనాన్ని పొంద

## విహారపట్టిన ఇంగ్లీషు...

గలరు. ఇతరుల మూలంగా వీరికి భేదాభిప్రాయాలు రావచ్చును.

తులారాశియందు జన్మించినవారికి మిధునరాశి (మే22— జూన్21) యందు జన్మించినవారికి మైత్రి బాగా ఉంటుంది. వీరి యిద్దరి స్వభావాల్లో పోలికలు చాలా ఉంటాయి కాని ఆచరణలో భేదం ఉంటుంది. జ్ఞానం జ్ఞానం కోసమే నని మిధునరాశివారి అభిప్రాయం కాగా జ్ఞానానికి కూడా ఒక ప్రయోజనం ఉందని తులారాశివారి అభిప్రాయం. అందుచేత వీరి మైత్రివల్ల తులారాశివారికే యెక్కువ ప్రయోజనం ఉంటుంది. మిధునరాశి వారివద్ద కంటే తులారాశి వారివద్ద వ్యవహారజ్ఞానం అధికంగా ఉంటుంది కాబట్టి మిధునరాశివారు తులారాశివారిని అనుసరించడం మంచిది.



తులారాశియందు జన్మించినవారికి కర్కాటక రాశి (జూన్ 22—జులై 22) యందు జన్మించిన వారికి స్నేహం సాధారణంగా ఉంటుంది. తులారాశి వారికి మానసిక విషయాలమీద సరదా అధికంగా ఉంటుంది. కర్కాటకరాశివారికి భౌతిక విషయాల మీద మోజు ఉంటుంది. అందువలన యేవిషయములోను వీరు యేకాభిప్రాయానికి రాలేరు. కాని దానివలన వీరి మైత్రికి భంగం కలగదు. కర్కాటక రాశివారు ప్రతి విషయంలోను తటపటాయించడం తులారాశివారికి నచ్చదు. తులారాశివారికి కార్య దక్షత అధికంగా ఉంటుంది. కాబట్టి తులారాశి వారిని కర్కాటక రాశివారు అనుసరించడం మంచిది.

తులారాశియందు జన్మించిన వారికి, సింహరాశి (జూలై 23— ఆగస్టు 22) యందు జన్మించిన వారికి మైత్రి సాధారణంగా ఉంటుంది. సింహరాశి వారి ఆత్మ విశ్వాసం అప్పుడప్పుడు అహంకారంగా మారుతుంటుంది. అప్పుడు తులారాశివారితో సింహ రాశివారికి భేదాభిప్రాయాలు రావచ్చును కాని తులా రాశివారు తమ శక్తిని జోడించినట్లయితే యెటువంటి కార్యాన్నైనా సాధించగలరు. సింహరాశివారి దుడుకుతనం వలన వీరి మైత్రికి భంగం కలగ వచ్చును.

తులారాశియందు జన్మించినవారికి కన్యారాశి (ఆగస్టు 23—సెప్టెంబరు22) యందు జన్మించిన వారికి స్నేహం సామాన్యంగా ఉంటుంది. ప్రారంభంలో వీరి స్నేహం చాలా ఆసక్తిదాయకంగా ఉంటుంది. కాని రానురాను అది తగ్గిపోతుంది. తులారాశివారికి మానసిక విషయాలమీద ఆసక్తి అధికంగా ఉంటుంది. అది కన్యారాశివారికి సరిపడదు. అందుచేత వీరు స్నేహితులుగా ఉండటంకంటే ఒక వ్యవహారంలో భాగస్వాములుగా ఉండడంవలన ప్రయోజనం ఉంటుంది. కన్యారాశివారు తమ విమర్శలను తగ్గించుకొంటే వీరి మైత్రి బాగుంటుంది.

### ఆరోగ్యం వగైరా

ఆరోగ్యం బాగా ఉంటుంది. వీరికి శారీరక శక్తి మానసికశక్తి సమానంగా ఉంటాయి. వీరు తమ ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడు కొనగలరు. తీవ్రమైన ఆలోచనవల్ల అనారోగ్యం చేయవచ్చును. మూత్రపిండానికి సంబంధించిన అనారోగ్యం చేయవచ్చును. ధనంకంటే వీరికి సుఖమే ప్రధానం.

### వీరికి అదృష్టాన్ని కలిగించేవి

రంగు—నీలం.

ధరించవలసినవి— నీలం (Sapphire) పచ్చ (Emarald)

సంఖ్యలు— 6. 15, 24, 33, 42, 51 వగైరా.

వారాలు— శుక్రవారం.

వేళలు—సెప్టెంబరు 23 మొదలు అక్టోబరు22
జనవరి 21 మొదలు ఫిబ్రవరి 19
మే22 మొదలు జూన్ 21.

సంవత్సరాలు (వయస్సు) 6, 15, 24, 33. 42, 51, 60 వగైరా.

(వచ్చేవారం—వృశ్చికం)

—మహేష్



లింగ్ తెంపులోని తుచా—క్యాంగ్ రాష్ట్రంలోని ఒక గ్రామం. ఆ గ్రామంలో ఒక పెద్ద ఇల్లు ఉండేది. అందులో ఒక మధ్యవయస్కుడయిన పెద్ద మనిషీ, ఆయన భార్యా ఉండేవారు. ఒక నాడు వాళ్ల ఇంటికి ఒక వర్తకుడు వచ్చాడు. అందమయిన వస్తువులు ఎన్నో అమ్మకానికి పెట్టాడు. వాటిని చూసి ముచ్చట పడిన ఇంటి యజమాని కొన్ని కొన్నాడు. వర్తకుడి వాలకం అతనికి బాగా నచ్చిందేమో అతనితో కబుర్లలోకి దిగాడు. హటాత్తుగా వర్తకుడు అన్నాడు :

'రెండు మూడేళ్ళ క్రితం మా ఊరు అబ్బాయి ఒకడు ఒక అమ్మాయిని ఎక్కడి నుంచో తెచ్చి పెళ్లి చేసుకున్నాడు. ఎవరో ఏ కుటుంబంనించి వచ్చిందో మా కెవ్వరికీ తెలీదు! మీరేమయినా చెప్పగలరా ?'

'ఆ అమ్మాయి ఇంటి పేరు తెలుసా బాబూ?' అని అడిగాడు ఇంటి యజమాని.

'పుట్టింటి పేరేనా ? టావ్ అని విన్నాను...'

'అయ్యో, నా కూతురు కాదుకదా !' అని అరిచాడు ఇంటి యజమాని టావ్.

'ఏమో, అయుండచ్చు...'

'పోనీ ఆ అమ్మాయి నెప్పుడన్నా చూశావా? ఎలా ఉంటుందో చెప్పగలవా ?' ఆత్రుతతో ప్రశ్నలు వేశాడు టావ్.

వర్తకుడు టూకీగా ఆ అమ్మాయిని వర్ణించాడు.

'బాబూ అది నా కూతురే, సందేహం లేదు !' అన్నాడు టావ్.

'ఆవిడని మళ్లీ చూడాలని లేదూ మీకు ?' అని అడిగాడు వర్తకుడు.

'ఎందుకు లేదూ! అందుకేగా ఇంకా బతికుంది !' టావ్ ఇలా అన్నాడో లేదో, లోపలనుంచి అతని భార్యకూడా హడావుడిగా బయటికి వచ్చింది. కళ్లనీరు తుడ్చుకుంటూ వర్తకుడితో ఇలా అంది: 'నిజమే నాయనా మేమిద్దరం ఇంకా ప్రాణంతో ఉన్నామంటే మూడేళ్లకింద మాయమయిన మా అమ్మాయిని మళ్లీ చూడగలుగుతామనే ఆశతోనే! నువ్వే మయినా మాకు సాయం చెయ్యగలిగావంటె మాకున్న ఆస్తిలో సగం ఇచ్చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాము...'

'అది సరేగాని, మీ అమ్మాయిని

గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తిపేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥

# పరిహాసం...

చూడాలని ఉందంటున్నారు. మీ అల్లుడి సంగతో ?' వర్తకుడు ఎంతో ఆత్రంగా వేశాడు ఈ ప్రశ్న. 'అతనిమీద మీ కోపం చల్లారద్దూ ?'

'ఇంకా ఏం కోపంలే. మా అమ్మాయి సుఖంగా ఉందంటే అదే చాలు మాకు...'

'మంచిదే—ఒక కథ చెప్తాను వినండి మీరు. పూర్తిగా వినేదాకా ఏమీ అనకండి.' అన్నాడు వర్తకుడు.

* * *

వాంగ్‌కి కొంత అల్లరి అలవాటు కాని మనిషి మాత్రం చెడ్డవాడు కాదు. 'కుర్రవాడు కొంచెం పెంకెగాని స్వభావంమంచిదే!' అనేవారు అతనికి తెలిసినవారంతా. వాంగ్ ఊరుపేరు వూషెంగ్. ఒకరోజు అతను అతని స్నేహితులు మరిద్దరూ కలిసి ఒక చిన్న యాత్రమీద వెళ్లారు. తిరుగు ప్రయాణంలో జూజింగ్ మీదుగా రావలసి వచ్చింది. అక్కడ కొంతసేపు గడిపి పక్క ఊరిలో రాత్రికి మకాం వెయ్యవచ్చు కదా అనుకున్నారు. సాయంత్రం బయలుదేరారు. ఊరి పొలిమేర సమీపిస్తూ ఉండగా సన్నటి వాన ప్రారంభం అయింది. 'కాసేపు చెట్టుకింద మంచుని వెడదా' మన్నాడు వాంగ్ స్నేహితులలో ఒకడు.

'ఎందుకూ. అవతల కనిపిస్తోందే ఆ ఇంట్లోకి పోదాము.' అన్నాడు వాంగ్.

'ఆ పెద్దఇల్లా? సరేరండి...' అన్నాడు మూడవ మనిషి. ముగ్గురూ ఇంటిని సమీపించారు. తీరా దగ్గిరికివస్తే కిటికీలు, తలుపులు అన్నీ మూసి ఉన్నాయి.

'ఇంట్లో ఎవరూ లేనట్లుంది...' ముగ్గురు స్నేహితులలో ఒకడు అన్నాడు.

'ఫరవాలేదు లోపలికి పోదా' మన్నాడు వాంగ్.

'అలా చొరబడితే బాగుంటుందా ?' అతని స్నేహితుడికి సందేహం వేసింది. అప్పటికి వాళ్ళు ఇంటి ఆవరణలో ఉన్నారు.

'పరాయి ఇల్లు కాదుకదా!' అన్నాడు వాంగ్.

'నీకు తెలిసినవాళ్లదా ?'

'అవును, మా మామయ్యదే' అన్నాడు వాంగ్. ముగ్గురూ గొల్లుమని నవ్వారు. అదే క్షణంలో ఇంటితలుపు తెరుచుకుంది ఒక పెద్దమనిషి బయటికి వచ్చాడు. 'ఎవరు అంత మర్యాద లేకుండా మాట్లాడింది ?' అని అడిగాడు కోపంగా. ముగ్గురు మిత్రులూ సిగ్గుతో తలవంచుకుని జవాబు చెప్పలేదు. కాని, వాంగ్ వాలకం మరింత భిన్నంగా ఉండటం చూసి అతనే ఆ మాటలు అన్నాడని గ్రహించాడు పెద్దాయన.

'అబ్బాయి! నీది ఏ ఊరో నాకు తెలియదు కాని మరీ అసభ్యంగా మాట్లాడావు! అయినా ఆశ్రయంకోసం వచ్చిన వారిని అమర్యాద చెయ్యటం నాకు అలవాటు లేదు. వీరిద్దరూ నా అతిధులు నువ్వేమో నాతో చుట్టరికం కలిపావు కాబట్టి అతిధితో సరితూగవు. అందుచేత వీరిద్దరినీ లోపలికి తీసుకువెడతాను. నువ్వు ఇంటివాడితో సమానుడివి. కొంచెం కష్టపడు. వీరికి కావలసిన పని అంతా చేసి తర్వాత బయటే ఈ వసారాలోనే ఉండు!' అన్నాడు. వాంగ్ సిగ్గుతో కుంగిపోయి అలాగే, అతను చెప్పినట్లే చేశాడు. వాన బాగా ఎక్కువ అయిపోయింది, ఆ రాత్రికి అక్కడే ఉండిపోవలసి వచ్చేట్టు కనిపించింది. ఇంటియజమాని చెప్పినట్లే వాంగ్ వసారాలో పడక వేశాడు. చలితో, లోపల రగులుతున్న సిగ్గు బాధతో అతనికి నిద్దరే పట్టలేదు. ఎలాగయినా స్నేహితులని తీసుకుని వెళ్లిపోదామా అనుకుంటూ చాపమీద ఇటూ అటూ దొర్లుతూ ఉన్నాడు.

ఇంతలో ఎవరో రహస్యంగా, 'ఇక్కడినుంచి వెళ్లిపోదాం, త్వరగా!' అన్నారు. తన స్నేహితులుకూడా ఇలాగే ఆలోచించి బయలుదేరారుకదా అనుకుని వాంగ్ అవసరంగా లేచి మంచున్నాడు. చీకటిలో అతనికి ఏదీ సరిగ్గా కనిపించటం లేదు తలుపు తెరుచుకుని ఇద్దరు బయటికి వచ్చినట్లు మాత్రం గ్రహించాడు. వచ్చిన వారిద్దరూ 'పోదాం, పోదాం!' అని గుసగుసలాడుతూ అతని చేతికి రెండు మూటలు ఇచ్చారు. వాంగ్ వాటిని పట్టుకుని హడావుడిగా బయటికి నడిచాడు. ముగ్గురూ వానని లెక్క చెయ్యకుండా ముందుకి వెళ్లిపోయారు. కొంతదూరం నడిచారు.

హఠాత్తుగా వాన ఆగిపోయింది. మబ్బు కూడా కొంత విడిపోయింది. కంగారు నుంచి తేరుకున్న వాంగ్ వెనక్కితిరిగి చూశాడు. అతనివెంట వస్తున్నది తన స్నేహితులుకారు! ఒక అమ్మాయి, ఒక వయసు మళ్లిన స్త్రీ. ఆమె పనిమనిషిలాగ కనిపించింది.

'ఎవరు మీరు?' అన్నాడు వాంగ్.

* * *

'మా అమ్మాయే బాబూ!' అన్నాడు టాప్. వర్తకుడికి ఇచ్చినమాట సంగతి మర్చిపోయాడు. 'అప్పటికి తెలీలేదు గాని దానికి ఇష్టంలేని సంబంధం ఒకటి కుదిర్చాము. అమ్మాయి చాలా అణకువగా ఉంటుంది కాబట్టి అంతగా ఎదురు చెప్పక పోతే అంతా సద్దుకుందనుకున్నాము! మా తప్పు తర్వాతగాని తెలిసి రాలేదు.'

'మీ అమ్మాయి కూడా అప్పటికి గండం తప్పించుకున్న దనుకున్నప్పటికీ తర్వాత తర్వాత బెంగ పెట్టుకుంది... అని విన్నాను. కాని తలిదండ్రుల మాట జవదాటి ఏ ముఖంతో ఇంటికి తిరిగి వస్తానని భయపడిందిట...అల్లుడు కూడా భయపడుతున్నాడు!' అన్నాడు వర్తకుడు.

'ఆ భయమేమీ అక్కర్లేదు. సగం ఆస్తి ఇస్తామన్నాంగా—మీ ఊరు ఏదో చెప్పు! మా అమ్మాయి దగ్గిరికి తీసుకుపో...' అన్నది ఇంటి యజమాని భార్య.

'అయితే అసలే బాధలేదు! మీ అల్లుడు వాంగ్ ఏదో పరాచికానికి అన్నమాట అతనికి పెళ్లి సంబంధం కుదిర్చింది. తన అసభ్య ప్రవర్తనకి ఎంతో నొచ్చుకున్నాడు. మీ అమ్మాయి అతన్నే పెళ్లి చేసుకుంది. వూషింగ్‌లోనే ఉంది. వాంగ్ మాత్రం ప్రస్తుతం ఇక్కడే ఉన్నాడు.' అంటూ మారువేషం తీసివేశాడు వర్తకుడు. ఆ తర్వాత అంతాసంతోషంగా కలిసిపోయారు. ఇప్పటికి అంటూ ఉంటారు కొందరు—పరిహాసంతో భార్యని సంపాదించుకున్న అబ్బాయి కథ తెలుసా? అని. —కె.

(ఒక పాత చైనా కథ ఆధారంగా)



'రాజయోగం'లో కాంతారావు, రాజశ్రీ.

చిత్రసమీక్ష:

# రాజయోగం

జానపదాలు 'అజానుపదాలు'గా వుంటేనే జనం హర్షించగల్గుతున్నారు ఈ సత్యాన్ని నిర్మాతలు ఎప్పుడో గ్రహించేశారు. రీళ్లను పెంచడం కోసం కథలో కీళ్లు వదులయినా పట్టించుకోక పోవడం జానపద చిత్రాల నిర్మాణంలో మొదటి నుంచి జరుగుతూ వస్తున్నది! రాజా పిక్చర్స్‌వారి 'రాజయోగం'లో అన్ని హంగులూ మిళాయిస్తూ కథని సంపూర్ణం చేయడం జరిగింది ఇది మెచ్చుకో తగిన విషయం.

'ఒకేమాట ఒకే బాట'మీద నడిచే ఒక మహారాజు విధిని ఎదిరించి సవాలు చేస్తాడు. తద్వారా భార్యబిడ్డలు ఒకరికొకరు కాకుండా దూరమైపోతారు. భార్య దాసిగా కష్టపడుతుంది. కొడుకు శస్త్రవాదుగా గుణవంతుడవుతాడు. కుమార్తె నర్తకిగా పేరు తెచ్చుకుంటుంది. విధి శపించిన మహారాజు రాజ్యాన్ని విడిచి అష్టకష్టాలు అనుభవిస్తాడు. భార్యని, కుమారుడ్ని, కుమార్తెని కన్నుల పండువగా చూసుకున్న క్లయిమాక్సు సీనులో అతనికి శాపవిమోచనం కల్గి జ్ఞానవంతుడవుతాడు!

ఈ కథ చిత్రీకరణలో లోపాలు కొట్టొచ్చినట్టు కనిపించినా 'మానవుడు విధికి బానిస' అనేది కథా వస్తువు గనక అవన్నీ లోపాలుగా కనిపించవు! కథకి క్లయిమాక్సు సీను మెరుగు పెట్టింది. కామినీ పిశాచం, కోరికలు తీర్చేమణి, జ్యోతిలక్ష్మి నృత్యం చిత్రానికి ఆకర్షణలు!

ముఖ్యపాత్రని రాజనాల ప్రతిభావంతంగా పోషించారు. నాయకీనాయకులుగా రాజశ్రీ, కాంతారావు పాత్రోచితంగా నటించి చిత్రానికి వన్నె తెచ్చారు. తదితర ముఖ్యపాత్రలని సత్యనారాయణ, రామకృష్ణ, రాజ్‌బాబు, ప్రభాకరరెడ్డి గీతాంజలి, విజయా కుమారి, పుష్పకుమారి మొదలైనవారు యథాశక్తి పోషించి చిత్రాన్ని జనరంజకం చేశారు.

కథ, మాటలు, పాటలు వీటూరి రాశారు. సత్యం సంగీత సారథ్యంలో మెచ్చుకోదగిన కృషి కనిపిస్తుంది. డైరెక్షన్, స్క్రీన్‌ప్లే, ఎడిటింగ్ వగైరా బాధ్యతల్ని నిర్వహించిన సుబ్బరామదాస్ అభినందనీయుడు.

దోనేపూడి కృష్ణమూర్తి నిర్వహించిన రాజా పిక్చర్స్‌వారి రాజయోగం చిత్ర నిర్మాత వీర్రాజా ప్రశంసనీయుడు.

—పితరాజా

# బాలతారలే భావితారలు!

'అన్నమానా పెద్దతారల గురించే నేమిటి — మా వయసులో వుండి నటిస్తున్న పిల్లల్ని గురించి రాయరేం?' అంటున్నారా ?— ఇదిగో సందర్భం వచ్చేసింది. ఇది మీ ప్రత్యేక సంచిక కాబట్టి మీరు మెచ్చిన బాలతారల్ని పరిచయం చేసేస్తున్నాను. కలుసుకోండి !...మీదే ఆలస్యం!

**బేబి రోజారమణి**

అది విజయరాఘవాచారి రోడ్డు. కొంచెం అలా ముందుకు వెళ్తే బేబీ రోజారమణి



యిల్లు వస్తుంది. రోజారమణి అంటే ఎవరో గుర్తుంది కదూ, 'భక్త ప్రహ్లాద'లో ప్రహ్లాదుడుగా పెద్దవాళ్లకే నోరు తిరుగని సంస్కృత శ్లోకాలు గడగడా చెప్పేస్తే మీరూ ; మీ తో పా టు పెద్దవాళ్లూ ఆశ్చర్యపోయారు చూశారూ? ఆ అమ్మాయి అన్నమాట ! ప్రహ్లాదుడుగానే గాక 'సతీ అరుంధతి'లో జమునకు కొడుకుగా వేసి పులులతో ఆడుకోవటం చూశారా మీరు? ... పెద్దపులిని దూరాన్నించి చూస్తేనే భయపడతాం కదా ! ఈ అమ్మాయి ఏం చేసిందో తెలుసా? ఆ క్రూరమృగాన్ని చూసి ఏమాత్రం చలించకుండా మచ్చిక చేసుకొని దానిమీద స్వారీచేస్తుంది. అంటే చాలా ధైర్యం వుందన్నమాట రోజా రమణికి,

వచ్చేశాం వాళ్లింటికి. ఆ ఎదురొచ్చే ఆయన మేష్టారు. రోజార మణికి పాఠాలు చెప్పేసి వెళ్లిపోతున్నట్టున్నారు.

పుస్తకాలు సంచీలోకి సర్దేసుకుంటున్న రోజారమణి 'గుడ్‌మార్నింగ్' అన్నది.

'రోజా, నువ్వు స్కూలుకివెళ్లి చదువుకోవటం లేదా ?'

'స్కూలుకి వెళ్లి చదువుకోవాలనే వుంటుందండీ! మరి స్కూల్లో అయితే— షూటింగులకీ, స్కూలుకీ సరిపడదుగా! అంచేత ఇంటి దగ్గరే చదువుకుంటున్నాను' అంది.

'చిన్నారి పాపలు'లో పాముల వాడిలాగా చక్కగా బూరా పట్టుకుని ఊదుతూ ఎంతో ధైర్యంగా పాముని నిలబెట్టి ఆడించిందీ అమ్మాయి—మీకు జ్ఞాపక ముందా ?

'నేను అరవ, కన్నడ సినిమాల్లో కూడా యాక్టు చేస్తున్నానండీ. అవిగాక యిప్పుడు 'సత్తెకాలపు సత్తెయ్య', 'సిరిసిరులు'తెలుగు చిత్రాల్లో వేస్తున్నాను' అన్నది మళ్లీ.

'ఖాళీగా వున్నపుడు ఏం చేస్తావ్ ?'

'ఖాళీగా వుంటే విసుగు పుడుతుంది. ఎప్పుడూ షూటింగ్ వుంటే బాగుంటుందనుకుంటానండీ ... నాకు యిష్టమైన స్కిప్పింగ్ ఆడుకుంటాను. సినిమాలు చూస్తాను'

మద్రాసు ఫిలిమ్ ఫాన్స్ అసోసియేషన్ వారు 1967సంవత్సరానికి ఉత్తమ బాల నటిగా ఎన్నికచేసిన యీ అమ్మాయికి — మరేమోను రామారావు, నాగేశ్వరరావు గార్లతో నటించాలని వుందిట. రోజా రమణి కోరిక త్వరలో నెరవేరకలదని ఆశించుదాం ! వీళ్లింటి దగ్గర్నుంచి కొద్దిగా ముందుకువెళ్లి ఎడమచేతి పక్కనున్న వీధిలోకి మళ్లితే— ఆ చివరగా వున్న పెద్దమేడ మాస్టర్ రాజాది.

**మాస్టర్ రాజా**

మాస్టర్ రాజా అంటే హీరో కాంతారావుగారి మూడో అబ్బాయి. ఇతను 'సుడి గుండాలు'లో జడ్జిగారి అబ్బాయిగా వేశాడు. చిన్న వయసులో అంతగొప్పగా నటించటం వింతయిన విషయం కదూ !

ప్రహరీ దాటి లోపలికి అడుగుపెట్టేసరికి ఫ్రెండ్స్‌తో ఆటలాడుతున్నాడు.

'హలో రాజా ! ఏమిటి పొద్దున్నే పుట్‌బాల్ ఆడుతున్నావ్ ?'

'ఇవాళ సండే కదండీ: స్కూలు లేదు. ఈ ఆట అంటే నాకు యిష్టం!'అన్నాడు దగ్గరికి వస్తూ.

'ఎక్కడ చదువుతున్నా వేమిటి ?'

'భారత్ మెట్రిక్యులేషన్ స్కూలు. ఫిఫ్త్‌క్లాస్ చదువుతున్నాను'

'సుడిగుండాలులో యాక్టు చేస్తున్నపుడు మొదటిరోజు షూటింగ్‌లో నీకేమీ భయం వెయ్యలేదూ ?'

'కెమెరా పక్కనున్న డైరెక్టర్‌గారు



యిచ్చిన ధైర్యం భయాన్ని తోలేసింది. అసలు భయం వెయ్యలేదు. మామూలుగా చేశాను' అన్నాడు రాజా.

రాజా నటించిన మొదటిచిత్రం 'సుడిగుండాలు'కి అవార్డు వచ్చింది. అతను పదిమంది మధ్యలోవున్నా వున్నట్టే తెలీదు. అంత కామ్‌గోయింగ్. అల్లరదీ చేయడం తక్కువ. స్కూలు లేకపోతే సినిమాలు చూడటం, ఆటలాడుకోవటం అతని హాబీ. ఇపుడు వాళ్ల నాన్నగారు నిర్మిస్తున్న 'సప్తస్వరాలు' చిత్రంలో నటిస్తున్నాడు.

'భవిష్యత్తులో మంచి నటుణ్ణి కావాలన్నది నా కోరికండి!' అన్నాడు రాజా చిరునవ్వుతో. ఆ చిరంజీవి కోరికకు ఆశ్చర్యం వేసింది. అతని మొహంలోకి చూశాను. పట్టుదల, కార్యదీక్ష ఆ లేత వదనంలో తొంగిచూస్తున్నవి.

### బేబి శాంతికళ

ఇప్పుడు మనం నాగార్జున నగర్ వచ్చాం. ఇక్కడంతా మనవాళ్లే — అంటే మన తెలుగువాళ్లు ఉంటారన్నమాట! సినిమాల్లో వేసేవాళ్లు, సినిమాల్లో పనిచేసేవాళ్లూ ఎక్కువగా ఉన్నారిక్కడ. వాళ్లంతా కలసి ఆ పేటకి నాగార్జున నగర్ అని పేరు పెట్టారు.

రాజ్‌బాబు ఉంటున్న యిల్లుదాటి కొంచెం అలా వెళ్తే శాంతికళ యిల్లు వస్తుంది. ఈఅమ్మాయి 'చిన్నారిపాపలు'లో అబ్బాయిగా వేసి బాగా ఒప్పించింది కదూ!

శాంతికళ ఇంట్లో లేదు. కౌముదీ పిక్చర్స్‌వారి షూటింగ్‌కి వెళ్లిందిట! ... ఇంకా 'నేనంటే నేనే' లోను, మోడరన్ థియేటర్స్‌వారు నిర్మిస్తున్న 'ఎవరు మొనగాడు' పాంఫికంలోను వేస్తోందిప్పుడు. ఈ అమ్మాయికి 'శాంతికళ' అనే పేరు ఎలా వచ్చిందో తెలుసా? ... వీళ్ల నాన్నగారు యస్. సాంబశివరావుగారని సినిమాల్లో స్టంటు మాస్టరు. మానాపురం అప్పారావుగారు 'శాంత' సినిమా తీస్తున్న టైములో — ఈయనకు యిబ్బంది ఏర్పడి, వాళ్ల వూరు వెళ్లిపోదామనుకుంటుండగా, మన హీరో రామారావుగారు ఆయన్ని పిలిచి 'శాంత'లో స్టంటుమాస్టరు పని యిప్పించారు. ఆ సినిమా తీస్తున్న రోజుల్లో పుట్టింది గనుక 'శాంతకళ' అని పేరు



పెట్టారు. దీన్ని సినిమావాళ్లు 'శాంతికళ'గా చేసేశారు.

సంగీతలక్ష్మి, మనసే మందిరం, మంగమ్మశపథం, నిర్దోషి, కంచుకోట, పెద్దక్కయ్య, శ్రీ కృష్ణావతారం చిత్రాలలో నటించిన బేబీ శాంతికళకు యిప్పుడు ఆరో ఏడు రెండోక్లాసు ప్రైవేటుగా చదువుకుంటోంది.

ఏదైనా ఒక్కసారి చెప్తే చాలు, చేసేస్తుంది శాంతికళ. రేడియోలో పాటలు వింటూ డాన్స్ చేస్తుంది. ఫైట్స్‌కూడా బాగా చేస్తుంది. వాళ్ల నాన్నగారు స్టంటు మాస్టరుకదా మరి! శాంతికళ చెల్లెలు కూడా సినిమాల్లో నటిస్తోంది. పేరేమిటో తెలుసా?

### బేబీ రాణి

'పాపకోసం'లో పాపగా వేసి ఒప్పించి మెప్పించి ఆశ్చర్యపరచిన—తారలకు తార—బేబీరాణి. మూడున్నర ఏళ్లున్న ఆ పాప చాలా గొప్పగా ఆ సినిమాలో నటించి 'భలేపాప' అనిపించుకుంది.

రాణి యింట్లోనేవుంది. తలుపు చాటున నక్కి 'ఎవరూ, నేను లేను!' అంది తొంగి చూస్తూ.

'అమ్మా దొంగా, యిక్కడి దాక్కున్నావా? నీకోసమే వెతుకుతున్నాను' అన్నాను చేయిపట్టుకుని.

'కనిపెట్టేశారా!' అని చిరునవ్వులు వెదజల్లుతూ యివతలికి వచ్చింది, భలే తమాషాలు చేస్తుంది అల్లరిపిల్ల. తప్పుల్లేకుండా ఎంతో స్పష్టంగా మాట్లాడుతుంది ఇంత చిన్నవయసులో కూడా.

మొదట 'సిత్తి' తమిళ చిత్రంలో వేసింది. ఆ తర్వాత అదే చిత్రం తెలుగులో 'పిన్ని' పేరుతో తీశారు. అందులోనూ వుంది రాణి. పాలమనసులు, పాపకోసం ఆ తర్వాత నటించినవి. ఔరత్ హిందీ చిత్రంలోను, రెండు కన్నడ చిత్రాల్లోకూడా నటించింది. 'పేశుమ్ దైవమ్' తమిళ చిత్రంలోనూ వేసింది.

వరకట్నం, అదృష్టవంతులు, బంగారు పంజరం, ప్రతిమా ఫిలింస్‌వారి చిత్రం — ప్రస్తుతం రాణినటిస్తున్న తెలుగుచిత్రాలు. పాపకోసం అరవంలో 'కుళందైక్కాగ' పేరుతో తీస్తున్నారు. దాంట్లోకూడా నటిస్తోంది.

రాణికి తండ్రి అన్నా, తమ్ముడన్నా ఎంతో యిష్టంట! అరవం, కన్నడం, హిందీకూడా మాట్లాడుతుంది.



అక్క చెల్లెళ్ళిద్దరూ చాలా కలివిడిగా, స్నేహంగా ఉంటారు.

షూటింగ్ లేనపుడు ఇంటిదగ్గరే చదువుకొంటుంది. సినిమాలు చూడటం సరదా. ఏపిల్స్, గుడ్లు యిష్టంగా తింటుంది రాణి

**'రాము' మాస్టర్ రాజ్‌కుమార్**

రాజ్‌కుమార్ అంటే 'రాము'లో రాముగా వెయ్యాలా? ... ఆ అబ్బాయి వాళ్ళిల్లు టౌన్ (సౌకార్‌పేట)లో వుంది అక్కడే వున్న జైన్ ప్రైమరీ స్కూల్లో ఐదో క్లాసు చదువుకుంటున్నాడు.

'రాము'లో మూగవానిగా అద్భుతమైన భావ ప్రకటన చేసి అందరి మెప్పులూ అందుకున్న యీ అబ్బాయికి యిప్పుడు పదకొండో ఏడు. 'మంచి మనిషి' సినిమాలో తెలుగులో మొదటి సారిగా నటించాడు చిన్న జగ్గయ్యగా. ఇతని అసలు పేరు యోగేంద్రకుమార్ అయితే, ఏ. వి. యం వారు ఆ పేరును రాజ్‌కుమార్‌గా మార్చేశారు.

"ఆత్రేయగారి 'చిన్నారి మనసులు'లో నేనే హీరో. ఇందులో నేను మూడు రకాల వేషాల్లో కనిపిస్తాను. ఒకటి రౌడీ. మరొకటి సాధువు— ఇంకోటి సాఫ్ట్ వెరైటీ వున్న మంచి వేషం" అన్నాడు రాజ్‌కుమార్.



'రాము' తమిళ చిత్రంలో కూడా వేసి మంచిపేరు తెచ్చుకున్నాడు రాజ్‌కుమార్.

'పద్మశ్రీలు — రామారావు శివాజీగణేశన్

## మీకు తెలుసా?

నిర్మాత శ్రీ సుంకువల్లి 'ముద్దుపాప' చిత్రాన్ని 71సార్లు చూసారుట!

ప్రముఖ దర్శక, నిర్మాత శ్రీ పత్రగాత్మ ప్రప్రథమంగా సంభాషణలు వ్రాసిన చిత్రం 'మా యింటి మహాలక్ష్మి'.

నేటి నవశక్తి ప్రొడక్షన్స్ అధినేత శ్రీ గంగాధరరావు ఒకప్పుడు స్టిల్ ఫొటోగ్రాఫర్.

ప్రముఖ సంగీత దర్శకుడు శ్రీ విశ్వనాథన్ కీ. శే. సుబ్బరామన్‌కు ప్రియతమ శిష్యుడు.

శ్రీ అనుమోలు వెంకటసుబ్బారావు నిర్మించిన మొదటి చిత్రం 'పెంపుడు కొడుకు.'

ఇప్పటి వీనస్ స్టుడియోను ఆ రోజుల్లో 'శోభనాచల' అని పిలిచేవారు.

శ్రీ పి. బి. శ్రీనివాస్ పాడిన మొదటి చిత్రం 'జాతకఫలం'.

విప్రనారాయణుడిగా నటించిన అక్కినేని నాగేశ్వరరావు నాటకాల్లో దేవదేవిగా నటించేవారు.

లంటే యిష్టం. ఏ. సి. త్రిలోక్ చందర్ నాకు నచ్చిన డైరక్టర్' అంటాడు.

'త్రిలోక్ చందరే ఎందుకు నచ్చారు?' అని నేను నవ్వుతూ అడిగినపుడు— అతను చటుక్కున అందుకుంటూ 'ఎలా నటించాలో విడమరచి చెపుతారాయన. అందులో సైలెంట్ ఏక్షన్ చాలాఇంప్రెసివ్‌గా చెప్పేవారు. ఆయన నాకు గురువుగారు' అన్నాడు.

చిన్నారి మనసులు, అందంకోసం పందెం తెలుగు చిత్రాలలోను, రెండు తమిళ చిత్రాలలోను ఇప్పుడు రాజకుమార్ నటిస్తున్నాడు. ఇతనికి ఒక చిన్న తమ్ముడున్నాడు. పేరు కృష్ణకుమార్. అతనూ నటుడే! 'ఇరు మలర్‌గళ్' తమిళ చిత్రంలో నాగేష్ కొడుకుగా వేసి ఎంతో అల్లరి చేశాడు. తీరిక వేళల్లో ఆడుకోవటం, మంచి మంచి పాటలు వినటం మాస్టర్ రాజ్‌కుమార్‌కి సరదాలు!

—మోహన్‌కుమార్

## సినిమా డైరీ

● శ్రీ రాజబాబుకు పుట్టిన మగ శిశువుకు నామకరణోత్సవం జులై 30 న జరిగింది. అదే రోజున సత్యనారాయణ వ్రతం జరిగింది. పరిశ్రమలోని ప్రముఖులనేకులు రాజబాబు దంపతులను, చిరంజీవిని ఆశీర్వదించారు.

● శ్రీ కె. ఎస్. గోపాలకృష్ణన్ తమిళంలో నిర్మిస్తున్న "ఉయిరా — మానమా" చిత్రంలో శ్రీ జెమిని గణేష్, సావిత్రి గణేష్ నిర్వహించవలసిన పాత్రలను ప్రస్తుతం శ్రీ టి. కె. భగవత్, శ్రీమతి ఎస్. వరలక్ష్మి ధరిస్తున్నారు. ఈ భూమికల్ని తెలుగు వెర్షన్‌లో శ్రీ రామారావు, శ్రీమతి సావిత్రి పోషిస్తున్నారు.

● రాజకపూర్ నిర్మిస్తున్న "మేరా నామ్ జోకర్" హిందీ చిత్రంలోని ఒక కథానాయిక పాత్రను షర్మిలా టాగూర్ ధరిస్తోంది.

● ప్రఖ్యాత హాలీవుడ్ నటి ఎలిజబెత్ టైలర్‌కు లండన్ నర్సింగ్ హోంలో యిటీవల గర్భకోశం శస్త్ర చికిత్స విజయవంతంగా జరిగినట్లు తెలుస్తోంది.

● పద్మా ఫిలింస్ పేరిట "ఏకవీర" చిత్రాన్ని శ్రీ రామారావు నాయకునిగా శ్రీ సి. ఎస్. రావు నిర్దేశకత్వంలో శ్రీ డి. ఎల్. నారాయణ నిర్మిస్తున్నారు.

● నవజ్యోతి పిక్చర్స్ తెలుగులో నిర్మించనున్న "బొమ్మలాటం" యొక్క సంభాషణలను శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ వ్రాస్తున్నారు.

● హోటల్ సవేరాలో ప్రముఖ హిందీనటుడు రాజేంద్రకుమార్ పుట్టిన రోజు పండుగను దర్శక నిర్మాత శ్రీ శ్రీధర్ వైభవంగా జరిపించరు.

● సంగీత దర్శకుడు శ్రీ సాలూరి రాజేశ్వరరావు కుమార్తె చి. సౌ. మంగమ్మను టి. గోవిందరాజులునాయుడుగారి కుమారుడు చి. టి. జి. వెంకటేశ్‌కు ఇచ్చి మైలాపూర్‌లో వైభవంగా వివాహం జరిపించారు. చలనచిత్ర పరిశ్రమలోని అనేకులువచ్చి వధూవరులను ఆశీర్వదించరు.

# శ్రీ వాణీ సాహిత్య క్రాస్‌వర్డ్ పజిల్ నెం. 13

Licensed by the District Collector Warangal. L. No.1 Dt. 8—10—67
(ఈ పజిల్ తాలూకు కీ సొల్యూషన్ జిల్లా కలెక్టర్‌గారి కార్యాలయములో సీలు చేయబడినది)

## రూ. 800 లు

### పోటీచేసి గెలుపొందండి!

మొదటి బహుమతి రు. 400 రైట్ ఆన్సర్
రెండవ బహుమతి రు. 250 ఒక తప్పు ఆన్సర్
౩వ బహుమతి రు. 150 రెండు తప్పుల ఆన్సర్

నిఘంటువు: శబ్దార్థ చంద్రిక

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 నా | గా | ర్జు | 2 | డు | ■ | 3 స | | 4 న | ము |
| | ■ | ■ | | ■ | ■ | ప్త | ■ | | ■ |
| 5 ము | 6 ర | | ■ | 7 అ | 8 సి | | ఘు | లు | ■ |
| ■ | | ■ | 9 | ■ | | ■ | ■ | ■ | 10 ద్వా |
| 11 | ■ | 12 న | గా | | ■ | ■ | 13 శం | | ర |
| డ | ■ | ■ | ర | ■ | 14 | సు | | ■ | |
| 15 క | | 16 భ | ము | ■ | ■ | ■ | 17 న | | ■ |
| ము | ■ | | ■ | 18 | రి | టి | ము | ■ | 19 మా |
| ■ | 20 | ■ | ■ | ■ | ■ | ■ | ■ | 21 ఈ | |
| 22 శం | జి | | ■ | 23 క | | ష | ము | ■ | డ |

ముగింపు తేది ౩౦-౮-౧౯౬౮

#### ఆధారములు

అడ్డము:- 1. అశోకుని యనంతరము బౌద్ధమత ప్రచారకులలో ఈతడు ముఖ్యుడు. 3. ప్రజలు తమ నాయకులకు తరచు యిది చేస్తుంటారు. 5. శ్రీకృష్ణుని చేతి దీని దవళి లోకాన్నంతటినీ సమ్మోహపరచెనట. 7. తెప్పపాటులేనివారు. 12. పూర్వము చాటింపులకు ప్రకటనలకు దీన్ని ఉపయోగించేవారు. 13. లక్ష్మీదేవి. 14. హిరణ్యాక్షుడు దీనినంతనూ చాపవలె చుట్టెనట. 15. ఎత్తయిన ఒక జంతువుయొక్క పిల్ల. 17. లేదు అని చెప్పుటకు వాడబడే అవ్యయము. 18. పూర్వము రాజులు దీన్ని తలపై ధరించేడివారు. 21. ఇది యెక్కువగా తీపి పదార్థములమీద మూసురుతుంది. 22. వింటి నారి. 23. ఇది చేసినవారికి నరకము తప్పదందురు.

నిలువు:- 1. పుణ్యాత్ముల కిది ప్రాపించునట. 2. ప్రతివాడు దేవునిగూర్చి యిది చేస్తారు. 3. తిథులలో నొకటి. 4. ఒకదానిని చూచి వ్రాసినది. 6. రాజమార్గము. 8. ఉత్కృష్టకాంతి. 9. స్త్రీలకు దీనియందు శ్రద్ధ మెండు. 10. శ్రీకృష్ణుడు నివసించిన పట్టణము. 11. ఒకానొక క్రూర మృగము. 13. వంటవేయుట కుపయోగపడు సమిధ. 16. భగవంతునిపట్ల మనము చూపవలసిన దిదియే. 19. కాగిన పాలపై ఏర్పడు తెట్టె. 20. యుద్ధ సమయములో సైనికుల కుపయోగపడే వాహనము.

## కూపను ఒక్కింటికి ఒక్క రూపాయి మాత్రమే

నిబంధనలు:- 1. కూపనులు తుడుపులు, కొట్టివేతలులేకుండా తెల్లకాగితముపై చదరము గళ్ళరూపములో గీసి చక్కగా సిరాతో వ్రాసి పంపవచ్చును. లేదా 30 పైసల పోస్టేజి పంపినచో అచ్చు కూపనులు పంపుదుము. కాని లిస్టురూపములో వ్రాయబడిన కూపనులు చెల్లనేరవు. 2. ప్రవేశరుసుము ప్రతికూపనుకు ఒక్కరూపాయి చొప్పున నగదురూపమునగాని, మనియార్డర్ లేక క్రాస్‌చేయని పోస్టల్‌ఆర్డర్ ద్వారాగాని పంపాలి. మనియార్డరైనచో M.O.రసీదు కూపనుతో తప్పక జతచేసి పంపవలెను. లేనిచో కూపనులు పోటీలో నుంచబడవు. 3. ఒకపేరుతో రెండు కూపనులకంటె యెక్కువ పంపరాదు. ప్రతి కూపనుపైన మరియు పోస్టల్‌ఆర్డరు, మనియార్డర్‌ఫారములవెనుకభాగమున తప్పక పోటీదారుని పూర్తిపేరు, అడ్రసు వగైరా విశదముగా వ్రాయవలెను. 4. కూపనులు ముగింపుతేది సాయంత్రం 8 గంటలలోపుగా మాకు చేరునట్లు పంపాలి నియమిత సమయందాటినతరువాతవచ్చిన కూపనులు పోటీలో చేర్చబడవు. 5. ఈ పజిల్సులో ప్రతిపోటీదారు తానుపంపే రైటు మొదలు రెండు తప్పులవరకుగల ప్రతి కూపనుకు బహుమతిపొందవచ్చును. 6. A. కీ సొల్యూషను మాత్రం 'ఆంధ్ర పత్రిక' తెలుగు దినపత్రికలో ముగింపు తేది తరువాత ఒక వారములో ప్రకటించబడును. విజేతల లిస్టు, కొత్త పజిల్ కూపనులు వగైరా కావలసినవారు 30 పైసల పోస్టేజి పంపి తెప్పించుకొనవలెను. 6.B. తమ కూపనుల పునఃపరిశీలనకోరే పోటీదారులు విజేతల లిస్టు ప్రకటించబడిన తేదీలగాయతు 30దినములలోపుగా రూ.5లు స్క్రూటినీ ఫీజు క్రింద మనియార్డరుద్వారాపంపుతూ ఒకదరఖాస్తు స్క్రూటినీ కమిటీ చైర్మన్‌గారిపేర వ్రాసి M.O. రశీదు దానితో జతపరచి మేనేజర్ అడ్రసుకు పంపవలెను. అప్పుడు వీలైనంత త్వరలో కమిటీ నిర్ణయాన్ని పోటీదారులకు తెలుపుదుము అట్టిపోటీదారులు విజేతలేయైనచో రావలసినబహుమతి మొత్తముతోపాటు స్క్రూటినీ ఫీజు కూడ తిరిగి పంపించబడును. కానిచో స్క్రూటినీ ఫీజు వాపసుచేయబడదు. నిర్ణీత గడువు దాటిన తరువాత ఎట్టి ఆక్షేపణలు అంగీకరింపబడవు. 7. కీ సొల్యూషన్‌లోని మాటకు సరిపోని ప్రతిమాట ఒక తప్పుగా ఎంచబడును. 8. ఈ పజిలుతాలూకు అన్ని విషయములలో మేనేజరుదే తుదినిర్ణయము. 9. ఇండియాలో తప్పయితర దేశములలో నివసించువారు ఈ పోటీలో పాల్గొనుట నిషేధించడమైనది. 10. పై నిబంధనలు ప్రభుత్వ రూల్సునసుసరించి రూపొందించబడినవి. కావున పోటీదారులెల్లరు పాటించి సహకరింపగోరుచున్నాము. 11. కూపనులు మనియార్డర్లు ఈ దిగువ అడ్రసుకు మాత్రమే పంపాలి.

The Manager, Sri Vani Sahitya Puzzles, Warangal-2. (A.P.)

# సినిమా

విన్నిబ్రదర్స్ నిర్మిస్తున్న 'కుంకుమ భరిణె'కు శ్రీ వేదాంతం రాఘవయ్య దర్శకుడా, కాదా అనే సందేహం యేర్పడడానికి కారణం యెవరో తెలుసా? ఇంకెవ్వరు. మన బాక్సాఫీస్ దర్శకుడు శ్రీ సి. ఎస్. రావే. గతవారం పీ ఎస్ వీ స్టుడియోలో 'కుంకుమ భరిణె' సెట్టులో రావుగారి షూటింగ్ చూచి, రాజనాలను వివరాలను అడిగా. మరేంలేదు. శ్రీ రాఘవయ్య ఒక తమిళ చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నా



'సరమంత్రపుసిరిలో' విజయలలిత.

రట. ఆ రోజు వాగేష్ కాల్‌షీటు యిచ్చాడట. అందుచేత, తనకు బదులుగా శ్రీ సి. ఎస్. రావును తాత్కాలికంగా సహాయం చేసిపెట్టమని అడగడమే తరువాయి శ్రీ రావు అంగీకరించారట. మరి సి. ఎస్. రావు దర్శకత్వం నెరపిన షెడ్యూలును గూర్చి మీకు వివరిస్తాను.

గూండా భీమరాజు, రాజనాల బంధించి, చిత్రవధ చేస్తాడు. నిజం చెప్పమని బెదిరిస్తాడు. దానికి భీమరాజు ఏమంటాడనుకున్నారు? 'గూండాగా బ్రతికాను, గూండాగానే చస్తాను' అని అరుస్తాడు. అయితే రాజనాల వూరుకుంటాడా? పిడుగుల అంజలీదేవిని బహుశా

# మీ చర్మాన్ని పుష్పదళం లాగ మెత్తగా, మృదువుగా యౌవనంగా వుంచుకోండి...

ఇందుకు మీ చర్మమందలి స్వాభావిక తేమను మీరు నిలబెట్టుకోవాలి. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌లోగల ఒక ప్రత్యేకమైన పదార్థము 'హ్యూమెక్టెంట్' చర్మపు తేమను నిలబెట్టి మీ చర్మాన్ని దుమ్ము, వాతావరణమునుండి రక్షిస్తుంది. తేలికైన, మంచువంటి పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మిమ్మలిని సొగసుగా కనబడేటట్టు వుంచి మీ చర్మాన్ని ఎల్లప్పుడు అందంగా, మృదువుగా, యౌవనంగా వుంచుతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మాత్రమే రాసుకొంటే మీ ముఖము సహజ మనోహరత్వముతో వుంటుంది. లేకపోతే అది రాసుకొన్న తరువాత పౌడర్ అద్దుకోవచ్చును. అప్పుడు పౌడర్ గంటల కొలది ఏక రీతిగా అంటుకొని వుంటుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్: ప్రపంచమంతటా అందగత్తెలు వాడే క్రీమ్!




**పాండ్స్** వ్యానిషింగ్ క్రీమ్ పౌడర్ అద్దుకొనుటకు ఉత్తమమైనది

చీస్‌బ్రొ-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఏ.లో స్థాపించబడినది)

...ని వస్తాడు. భీమరాజుని చూపిస్తూ 'పిడికిలి నీకూ వచ్చింది. పూర్తి నిజం చెప్పు' అని హుంకరిస్తాడు. ఈ సన్నివేశంలో అంజలీదేవి, రాజనాల, భీమరాజాలను శ్రీ సి. ఎస్. రావ్ యెలా నటింపచేసారో మీరు చూస్తారుగా.

* * *

సీటు ముగించుకుని భీమరాజా నన్ను సమీపించాడు. 'ఏమిటి విశేషం అని అడిగా' 'మరేంలేదు సార్. ఇప్పుడిప్పుడే నాల్గు మంచి చిత్రాల్లో ప్రాధాన్యతగల పాత్రలను పోషిస్తున్నా' అన్నాడు.

**జానపద చిత్రాల్లో వైవిధ్యం**

రాజశ్రీని కాంతారావు గాఢంగా ప్రేమిస్తున్నాడని ధూళిపాళ పసిగట్టాడు. వీళ్ళిద్దర్ని ఎలా విడదీయడమా అని ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. ఏమిటా నిర్ణయం? ఎందుకా పన్నాగం?...

'మహారాణి చంపబడ్డ ప్రదేశంలోనే మహారాజును కాంతారావు హత్య చేసాడనేదే నా నమ్మకం. మీకు ఆయనపైగల అను



# పాత బొమ్మలు - కొత్త కబుర్లు

పాపలూ! ఈ పాప ఎవరో మీరు ఎరుగుదురా ? ఎరిగినట్లే వుంది కదూ. ఎక్కడో చూసినట్లు గుర్తుంది కాని, ఎక్కడ చెప్మా అని ఆలోచిస్తున్నారా?...

మీ వయసులో వున్న(పుడు) ఈ పాప పేరు కుసుమ కుమారి. ఈ పేరుతోనే అప్పుడు సినిమాల్లో వేసింది. ఆ కుసుమకుమారి ఇంతది–అంతై, అంతది ఇంతై– మొత్తానికి రాజశ్రీ అంత అయింది.

కుసుమకుమారి రాజశ్రీ అవటానికి ఓ చిన్న కారణం వుంది. అప్పుడు ఇంకొక పెద్ద కుసుమకుమారి వుండేది ... ఆమె పెద్దదీ, ఈమె చిన్నదీ అయినా, ఒకే పేరు కలిగి వుండటంవల్ల–సినిమా కంపెనీవాళ్ళు ఒకళ్ళని పిలవటానికి మరొకళ్ళని ఫోనుల్లోను, తదితరత్రాను పిలిచి యిబ్బందులు పడేవారుట.

అబ్బే, ఇదేం లాభం లేదు– అంతా గొడవలు గొడవలుగా వుందనుకొని ఈ కుసుమకుమారి ఓ రోజు పొద్దున్నే 'రాజశ్రీ'గా మారిపోయింది. ఆ కుసుమ కుమారి 'మాలిని' అయింది.

పినిశెట్టిగారు 'నిత్యకల్యాణం — పచ్చతోరణం' తీస్తున్న రోజుల్లో వీళ్ళక్కగారు శ్రీమతి నిర్మల ఈ పాపను రాజశ్రీగా మార్చి, పేర్ల తిరకాసునుంచి అలా తప్పించారన్న మాట! ఈ ఫోటో ఆ టైములో తీసింది. నాడు ఎ. వి. ఎం. వారి 'నాగుల చవితి'లో చిన్నజమునగా వేసిన బేబీ కుసుమకుమారి–నేడు కథానాయిక రాజశ్రీ అయింది. గమ్మత్తుగా వుంది కదూ!

—మోహన్ కుమార్

# సినిమా

రాగాభిమానాలు నిజాన్ని నమ్మించలేక పోతున్నాయి. మీకు మిగిలిన మిత్రులం మేమే; తర్వాత మీయిష్టం' అంటూ ధూళిపాళ చక, చక వెళ్ళిపోతాడు. పాపం రాజశ్రీ ఏకాకిగ తన వ్యర్థ జీవితాన్ని గూర్చి చింతిస్తూ వుంటుంది. ఈ సన్నివేశం నవభారత్ ఫిలింస్ నిర్మించే 'అగ్గిమీద గుగ్గిలం'లో కన్పడుతుంది.

జానపద చిత్రాల్లో కొంత వైవిధ్యాన్ని తీసుకురావాలనెడి తలంపుతో శ్రీ భావనారాయణ కథను వ్రాసారు. శ్రీ పింగళి సంభాషణలను, సత్యం సంగీతాన్ని, వేణు కెమెరాను నిర్వహించే యీ చిత్రాన్ని శ్రీ ఎ. పూర్ణచంద్రరావు పూర్ణా ద్వారా సెప్టెంబరులో విడుదల చెయ్యాలనుకుంటున్నారు.

* * *

'అగ్గిమీద గుగ్గిలం' పూర్తికాగానే రెండవ చిత్రాన్నికూడ వెనువెంటనే ప్రారంభించ దల్చినట్లు, ప్రస్తుతం కథను వినే ఘట్టంలో వున్నట్లు నిర్మాత వెల్లడించారు.

**కవిత కనుగుణంగా గానమాధుర్యం**

గోల్డెన్‌నుండి వస్తూ వాహినిలో రికార్డింగ్ జరుగుతూందని తెలిసి లోపలికెళ్ళాను. వెళ్ళినవాణ్ణి అలాగే గేటు వద్దనే నిల్చుండిపోయాను. ఆహా, ఏమిటీ అమరగానం. నేను పొందిన ఆనందం అనిర్వచనీయం. నేనుమాత్రం సంతోషిస్తే చాలా చెప్పండి. ఆ పాటను కవి ఆరుద్ర మీ మనస్సులో ముద్రపడేట్లు వ్రాసారు. కవి భావాల కనుగుణ్యంగా సుశీల, ఘంటసాలలు తమ గాన మాధుర్యాన్ని జోడించారు. ఇంత మధురమయిన పాట యెవరి కోసమనుకున్నారు. రాజశ్రీ, శోభన్ బాబుల కొరకే. ఎందులో తెలుసా? ప్రసాద్ ఆర్ట్సు 'సత్తెకాలపు సత్తెయ్య' చిత్రంలో ప్రేయసీ ప్రియులు పరస్పరాలింగన పారవశ్యంలో పాడే యీ ఘట్టం మీ హృదయాన్ని పులకింపజేస్తుంది. శ్రీ కె. బాలచందర్ దర్శకత్వంతో నిర్మితమయ్యే యీ చిత్రం అక్టోబరు మొదటివారంలో విడుదల కాగలదని నిర్మాత ప్రసాద్ వ్యక్తపర్చారు.

* * *

పాటను మీరగా చదవండి. మీకే తెలుస్తుంది అందులోని మజా. ఆ మజాను కల్పించిం దెవరనుకున్నారు. సంగీత దర్శకుడు విశ్వనాథంగారే.

'నన్ను ఎవరో తాకిరి, కన్ను ఎవరో కలిపిరి, చూపులోనే ఆవలేని మత్తుమందు జల్లిరి' అని ఘంటసాల శ్రావ్యమైన గాత్రం మగవాడిమోహాన్ని ప్రస్ఫుటింపచేస్తే సుశీల కోకిలకంఠం మృదుమధుర మయిన స్వరంలో 'నన్ను ఎవరో చూచిరి కన్నెమనసే దోచిరి, చూపులోనే ఆవలేని మత్తుమందును జల్లిరి' అంటూ అందుకుంది.



'అగ్గిమీద గుగ్గిలం'లో మీనాకుమారి, రాజశ్రీ.

## నటుని గొంతుకి సరైన బేస్ వాయిస్

వాసూనుండి విజయగార్డెన్స్‌లోకి పోయి చూస్తే అక్కడ ఆరుద్ర వ్రాసిన పాటనే సంగీత దర్శకుడు వేణు బసవేశ్వర్‌చే పాడించారు. ఈ పాట నవశక్తి ప్రొడక్షన్స్ 'విందు సంసారం'లో వినిపిస్తుంది. ఎవరు దీన్ని తెరపై పెడ్తారో తెలుసా? ప్రముఖ హాస్యనటుడు పద్మనాభమే. బసవేశ్వర్‌పాడిన పల్లవి యిది:

'మైడియర్ తులశమ్మక్కా లక్కీ ఛాన్సు కొట్టేశా మజాగా రేపో మాపో జ్యోతికి తాళికట్టేస్తా' అంటూ బసవేశ్వర్ యెంత తియ్యగా పాడారనుకున్నారు! పద్మనాభం వాయిస్‌కు యీ యువగాయకుని నయినయిన బేస్‌వాయిసే కరెక్టుగా సరిపోయిందంటే నమ్మండి.

—శ్రీనివాస్

ఆటలు

# కొందరు బ్రిటిష్ వ్యాఖ్యాతల, అధికారుల ధోరణి



ఇంగ్లండ్, ఆస్ట్రేలియాల మధ్య జరిగిన నాలుగవ టెస్టు 'డ్రా' అయింది. దానితో టెస్టు మాచ్‌లలో ఆస్ట్రేలియాకి 'ఆషెస్' దక్కాయి. మొదటి మాచ్‌ని ఎలాగూ ఆదేశమే గెలిచింది. ఈసంవత్సరం ఆస్ట్రేలియా పరిస్థితిలో మార్పు రాలేదనే చెప్పాలి!

ఈ మాచ్‌లమీద జరిగిన రేడియో కామెంట్రీలు కొన్ని విన్నాను. వాటినిగురించి నాకు కలిగిన అభిప్రాయాలని పాఠకులకి చెప్పాలనుకుంటున్నాను. ప్రత్యేకంగా కొందరు బ్రిటిష్ వ్యాఖ్యాతలు, అధికారుల ధోరణిని గురించి ఈవారం రాయదలచుకున్నాను. నేను రాయబోయేది కొందరికి నచ్చక పోవచ్చు., నేను నిష్పక్షపాతంగా రాయటం లేదనే అనుమానం వారికి కలగవచ్చు! బ్రిటిషు క్రీడా — వ్యాఖ్యాతలు వారి నిష్పక్షపాత బుద్ధికి పేరు పొందిన వారుకదా అనుకోవచ్చు... కాని బ్రిటిషు వ్యాఖ్యాతలు వారి ఆటగాళ్లు ఇతర దేశాలకి వెళ్లినప్పుడు అక్కడ అధికారులని, అంపయిర్లని, ఇతరులని విమర్శించటానికి ఎప్పుడూ వెనుకాడరు. అందుచేత ఉన్న సంగతి చెప్పటం ఎప్పుడూ, మంచిది.

పోయినసారి బ్రిటిషుజట్టు మన దేశం పర్యటించినప్పుడు మన క్రీడాకారులు బాగా ఆడారు. అంతర్జాతీయంగా వారికీర్తి పెరిగింది. ఈ మాచ్‌లు జరిగినప్పుడు బ్రిటిషు జట్టుతో కొందరు విలేఖరులు వచ్చారు. వారికి ఎంతో మర్యాద జరిగింది. (నేను అప్పుడు మదరాసు ప్రెస్ కమిటీలో ఒక సభ్యుడిని. వారికి ఎంతమర్యాదచేశారో నాకు స్వయంగా తెలుసు.) కాని, వారు భారతదేశంలో అధికారులు తమకోసం చేసిన ఆహార, వసతి ఏర్పాట్లు బాగాలేవని విమర్శించారు. ఇక్కడి అంపయిర్ల నిర్ణయాలు న్యాయంగా లేవని విమర్శలద్వారా సూచించారు. ఇదంతా 'స్పోర్టింగ్' వైఖరి కాదు కదా!

ఫింగిల్టన్ ఎంతో పెద్ద క్రికెట్ ఆటగాడు, పేరు మోసిన వ్యాఖ్యాత. అతను మూడవ టెస్టును గురించి రాస్తూ ఇంగ్లండ్ తరఫున ఆడిన బాట్స్‌మన్‌ని గురించి ఎదురు జట్టు వారు చేసిన అప్పీళ్లని బ్రిటిషు అంపయిర్లు ఎలాతోసివేసేవారో వర్ణించారు. ఆస్ట్రేలియా తరఫున ఆట మొదలు పెట్టిన ఓపెనింగ్ బాట్స్‌మన్ రెడ్‌పాత్‌ని తేలికగా పెవిలియన్‌కి పంపించి వేయించాడు ఒక అంపయిర్. 'అంపయిర్ల ప్రవర్తనలో ఎగుడు దిగుళ్లు ఉండరాదు?' అన్నాడు ఫింగిల్టన్. ఇంతప్రఖ్యాతి కల వ్యాఖ్యాత అన్నదానిని తేలికగా తీసివేయటం సాధ్యం కాదు. క్రికెట్‌పుట్టినిల్లయిన బ్రిటన్‌లోనే అంపయిర్ల ప్రవర్తన సరిగా లేకపోతే ఎలాగు!

కొందరు విలేఖరులు భారత దేశంలో క్రికెట్ పిచ్‌లు సరిగ్గా లేవన్నారు. మరి ఇంగ్లండ్‌కి వెళ్లిన ఇతరదేశాల జట్లవారు అక్కడి పిచ్‌లని విమర్శించ చారే? దాని సంగతి ఏమిటి? తమ పరిస్థితిబాగున్నప్పుడే కదా ఇతరులని ధారాళంగా విమర్శించాలి! (ఈ ఏడు బ్రిటన్‌లో పిచ్‌ల తయారీ పద్ధతులని పరిశీలించటానికి ఒక కమిటీని వేశారు.)

ఇక రన్నింగ్ కామెంట్రీలని గురించి ఒకమాట. కాన్స్టంటైన్ ఆస్ట్రేలియా బవులర్లలో పెద్దవారిలో ఒకడు. ఇతని గురించి ఒక ఒక వ్యాఖ్యాత ఇలాఅన్నాడు. 'అతను మంచి బవులర్‌కాని ఇంగ్లీషు బాట్స్‌మన్ అతనికి తగనిగౌరవం ఇచ్చారు..'

ఇది సహృదయంతో చేసిన మెప్పుకాదని వేరే చెప్పాలా? ఇటువంటి ఉదాహరణలు ఎన్నో చెప్పగలను., కాని అనవసరం. పూర్తిగా నిష్పక్షపాతంగా అందరూ ఉండ లేరుకాని గురివింద గింజ సామెతనయిన గుర్తుకు తెచ్చుకోవటం మంచిది....

ఇంగ్లీషు భాషలో 'స్పోర్టింగ్' అనే మాటకి చక్కని అర్థం ఉంది. బ్రిటిషు వ్యాఖ్యాతలు ఈ అర్థాన్ని బాగా అవగాహన చేసుకోవటం మంచిది.

— కె. ఎస్. నరసింహన్

## బొమ్మల నుడికట్టు

(జవాబులు)

**అడ్డం :**

3. పాపిక
5. దక్కను
6. పాము
7. మోపు
9. నావ
10. కారు
11. లామా
13. పాలు
15. నవరం
17. కలము
18. గిన్నెలు

**నిలువు :**

1. పుట్ట
2. ముదము
3. పానుపు
4. కన్ను
6. పావలా
8. మోకాలు
12. మానము
13. పారంగి
14. ఈక
16. తేలు

## భూగోళశాస్త్రం...?

(జవాబులు)

1. ఈక్వెడార్
2. కొలంబియా
3. వెనిజులా
4. బ్రిటిష్ గయానా
5. సురినామ్
6. ఫ్రెంచ్ గయానా
7. బ్రెజిల్
8. యురుగ్వే
9. అర్జంటినా
10. చిలి
11. పెరాగ్వే
12. బొలివియా
23. పెరూ

Editea, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

